# మనవి

శ్రీ దివ్వేల పిచ్చయ్య గుప్తగారివద్ద నేను హిందీ భాషాధ్యయనము చేసే కాలంలో దైవికంగా "ఆర్యావర్త" అను హిందీ పద్యకావ్యాన్ని చదివే అపూర్వ అవకాశం నాకు లభించింది. తరువాత ఆ కావ్యశ్రేష్ఠత్వాన్ని బట్టి దాని యాధారముపై తెనుగు భాషలో రచన చేయవలెనను భావ ముదయించింది. ఆ భావము ఈ నాటికి రూపొందినందుకు భగవంతునకు కోటిశః ధన్యవాదాలు.

అ. స్వా. లక్ష్మి

విఘ్నేశ్వరాయ నమః

# మహావీర పృథ్వీరాజు

సూర్యభగవానుడు అంధకార సముద్రములో మునుగుట తోడనే సంధ్యాదేవి శోకముతో వ్యాకులత్వాం చెంది మౌనంగా అడుగులువేస్తూ వచ్చింది. కీచురాళ్ళధ్వని గజ్జల మ్రోతలాగ ప్రతిధ్వనింపసాగింది. భయంచేత పొదల్లో దాగిన అంధకారము ఇప్పుడిప్పుడే తొంగిచూడ నారంభించింది. సృష్ట్యాదినుండి నిశారాణి దినరాజును, దినరాజు నిశారాణిని కన్ను విప్పి చూడకపోయినప్పటికి రవి విరహంతో నిశారాణి వ్యాకులపడసాగింది. రవికూడా నిశారాణి వియోగముతో తపించిపోతున్నాడు. ఆహా! ఏమి ప్రేమ! ఎట్టివియోగం!

జనపదానికి దూరంగా అరణ్యమధ్యంలో పాడుబడిన చెండికామందిర మొకటిఉంది. అది భయంకరమై, వైభవ హీనమై, భగ్నశిఖరమై, చేతులు తెగిన కబంధునులాగ కనపడుతూ ఉంది. రాళ్ళతో దృఢంగా కట్టబడ్డ ఆవరణ అనే వక్షస్థలం చీల్చుకొని రావి మొలకలు పైకిలేచినాయి. మానవ నిర్మాణము ప్రకృతి నియమాన్ని అతిక్రమింపలేదుగదా! మందిర స్తంభాలు, అస్థిపంజరాల్లాగ కన్పిస్తూ వున్నాయి. పాడుబడ్డ గోడల్లోని యిటికరాళ్ళు భయంతో పారిపోవుటకు

తొంగి చూస్తున్నారేమో అన్నట్లున్నాయి. సుఖమయమూ స్వస్థమూ సుదీర్ఘమైన భూతకాలం తిరిగివచ్చుట సంభవమూ అన్నట్లు పూజారుల హృదయాలకు స్ఫురిస్తున్నాయి. ఆహా! హద్దులు గల ప్రపంచంలో ఆశ హద్దులు దాటి సంచరిస్తుంది గదా! మండపం చివర భాగాన్లో గూళ్ళు కట్టుకొని ఉన్న పావురాలు, కాటుకపిట్టలు సుఖంగా నివసిస్తూ ఉన్నాయి. గుడ్లగూబల కది పగటి నివాస స్థానము.

మందిరంలోపల చండికామూర్తి విరాజిల్లుతూ ఉంది. ఆ దేవి చేతికత్తి ధరించింది. అచంచల అగ్నిజ్వాలలాంటి జిహ్వతోను, విశాల నేత్రాలతోను, ఎత్తైన కనుబొమలతోను వేదికనుండి భూమిపై కుప్పించనున్నదో యన్నట్లు కన్పిస్తూ ఉంది. శత్రుగర్వ మర్దన సమర్థమైన ఆ భవాని రూపమతి భయంకరం. మందిర భాగమంతా ధూళిచేత, ఎండిన పండుటాకులచేత నిండిఉంది. చిరకాలమునుండి మానవుడు పొరపాటునగూడ నిటు దృష్టి సారించినట్లు లేదు. వన్యమృగాలు నిర్భయంగా, స్వేచ్ఛగా తిరుగుతున్నాయి. ఒకమూల ఎండిన ఎముకల ప్రోగు ఉంది బహుశా ఏ సింహమో తన వేట మృగాన్నిక్కడ తిని ఉంటుంది. నాల్గువైపులా భయంకర దుర్గమారణ్యం. తూర్పుదిక్కునుండి ఎడతెగక వీచే పెను గాలియూ, ఊపులకు ఊగే వృక్షాలు పిశాచాల్లాగ భయం గొల్పుతున్నాయి. మందిరపు మెట్ల సన్నని పగుళ్ళనుండి గడ్డి మొలిచింది ఒకప్పుడు వీటిపై భక్తుల పాదచిహ్నాలు పడిఉండేవి. కాలిబాట గడ్డి చాటుననుండి ఆపదచిహ్నాలను భయంకర కాల దృష్టినుండి రక్షిస్తూ ఉంది. ఆ పదచిహ్నా

లపై నున్న విశ్వాసంతోనే ఆ బాట నశించలేదు. ఆ యరణ్యమంతా నిర్జనమై, దుర్గమమై, దుఃఖమయమై ఉంది.

ఆసమయంలో వజ్రనిర్మిత కవాటసదృశ వక్షస్థలుడు, యౌవనోజ్జ్వలిత శరీరుడు, ఖండిత శత్రుగర్వ ప్రచండ భుజదండుడు, అంగప్రత్యంగ కవచాలంకృతుడు, శ్రాంతగమనంతో, చింతిత వదనంతో, ఖడ్గహీనకోశంతో, శిథిలకటిబంధంతో, సిద్ధుడు కప్పిన నిప్పులాగ, మేఘాచ్ఛాదిత చండకరుడువలె, ధూమ వ్యాప్త ధూమకేతువువలె, శరీరహిత శరాసనము వీపున వ్రేలాడ కోదండసహిత వామకరుడై తేజోవిరాజితుడైన ఒక వీరకిశోరుడు అరణ్యమధ్యంలో అధీర మనస్సుతో ప్రవేశించి ఒకసారి నాల్గుదిక్కుల కలయజూచి పెద్ద నిట్టూర్పు విడిచాడు. క్షుద్రతృణ కంటకాలను పదాఘాతాలతో నుద్దుతూ ముందుకుసాగినాడు. భయంకరారణ్య హృదయం కంపించిందో యన్నట్లు ఆకులు కంపించాయి. నక్కలకూతలు, కీచురాళ్ళ ధ్వనులు ఒక్కసారిగ ఆగిపోయినాయి ఆ వీరుడు మధ్య మధ్య ఆగుతూ ఏదో ఆలోచిస్తూ అప్పుడప్పుడూ తిరిగి చూస్తూ ముందుకు సాగినాడు. ఇంతలో మహోన్నత వృక్షమొక్కటి నిశ్శబ్దత ముఖంతో, గాయపడిన శరీరంతో ప్రవేశించాడు. రాహుగ్రస్తచంద్రుని వలె అతని నొసటి ఫాలభాగంపై రక్తపు చుక్కలు చిందిఉన్నాయి. అతడు విరిగిన కత్తిని నేలకాన్చుకొంటూ ఆగి ఆగి నడుస్తూ ఉన్నాడు. ఈ విధంగా ఆ వీరులిద్దరూ దేవి మందిరంలో ప్రవేశించాడు. ఇద్దరు శోకవ్యాకుల హృదయంతో దేవికి నమస్కరించారు. రాళ్ళతో నిర్మించిన మంది

రపు లోపలిభాగంలో ఇనుపకవచాల తాకిడిచేత అగ్ని కణాలా విర్భవించాయి. భయంకరమైన కాళికామూర్తి నవ్విందో యన్నట్లు రాళ్ళకు తగిలిన కత్తుల ధ్వని ప్రతిధ్వనించింది. మొదట వచ్చిన వ్యక్తి భారతదేశ ప్రతిష్ట, భారతికి ముద్దు బిడ్డ, భారత సామ్రాట్ పృథ్వీరాజుకు కుడిభుజమైన చంద కవి. రెండవవ్యక్తి వీరకేసరి రాణా శ్రీ సమరసి. అతడు పరా జయమనే భయంకర బాధతో వ్యాకులపడుచున్నాడు. సమర భూమినుండి విఫలమనోరథుడై శత్రుప్రహార ఋణాన్ని వడ్డితో గూడదీర్చుకోనవలెనని బాధపడుతున్నాడు. కాని అదృష్టాకాశంపై విరాజిల్లే సూర్యుడు రక్తపారావారంలో అస్తమించాడనే దుఃఖమావిరునావరించింది. రణరంగ మహాసముద్రమునుండి ఈదుకొని వొడ్డు చేరాడు. తనవారి శవాలే అతనికి నావలైనాయి. అట్లా నాడు ఆర్య మహా సేనలో మిగిలిన యీ యిరువురూ శౌర్యము, శాంతరసం ఒకేసారి నిరాశ్రములై దేవి పాదసన్నిధికి చేరినట్లు చండికా మందిరానికి చేరారు.

అది పృథ్వీరాజ, గోరీల అంతిమ సమరం. పవిత్ర ఆర్యభూమి భవిష్యదంతిమ నిర్ణయం. పూర్తిగా మారి పోయింది. దురదృష్టవంతులు భగవత్సన్నిధికి వరంకోసం పోతారుకాని విధి వారిని శాపగ్రస్తులుగా చేసి పంపుతుంది. కర్మఫలం త్రికాలములందు అక్షయమైందే, దానికి నాశనం లేదు. ఆకాశాన హాహాకారాలు చేస్తూ హఠాత్తుగా సూర్యుని గ్రమించే రాహువును అందరు భయంతో చూస్తారే కాని సూర్యుని రక్షించే సాహసం ఎవరికుంటుంది. అదేవిధంగా

గోరీ ఢిల్లీపతిని భయంకర యుద్ధంలో మ్రింగివేశాడు. అప్పుడు భారతదేశమంతా వేసవికాలంలో తగలబడుతున్న గ్రామాన్ని చల్లార్ప నీరులేక అవస్థపడే గ్రామ గృహస్థులవలె దుఃఖాన్ని అనుభవిస్తూ చూస్తోంది. కాలాగ్నిజ్వాలవంటి యుద్ధక్షేత్రంలో కేవలం చందకవి, వీర పుంగవుడైన సమరసిమాత్రం మిగిలారు.

రాత్రి నాల్గవజాము ఆకాశాన చంద్రుడు వెన్నెల విరబోస్తూ ఉన్నాడు. సరోవరాలలో ఎఱ్ఱకలువ పూలు వికసింపసాగాయి. చల్లని పిల్లగాలి మెల్ల మెల్లగ వీవసాగింది. అట్టి సమయంలో చందకవి సమరసితో ఇట్లన్నాడు "వీర కేసరీ! ఆ మహా యుద్ధమునుండి నీ వెలా రాగలిగావు? యుద్ధ క్షేత్రమంతా రక్తప్రవాహంతో, నరకబడ్డ తలలతో, తెగిన కరపాదాలతో నిండి ఉంది. శత్రుమిత్రులను భేదభావం లేక ఉన్మత్తులైన వీరులు చేతకత్తులు ధరించి వసంతోత్సవాలాడుతున్నారు. చూస్తూ ఉండగానే యుద్ధభూమి స్మశానభూమిగా మారిపోయింది. సూర్యోస్తమయమైన వెంటనే రెండు వైపుల నుండి ప్రళయతరంగాలు పెద్దగా లేచాయి. ఆ యుద్ధ సముద్రంలో వీరత్వం మునిగి అదృశ్యమైంది. మాతృభూమి సౌభాగ్య మంతరించింది. ఆర్యజాతి భవిష్యత్తు అంధకారమయమయింది. స్వాతంత్ర్య జ్యోతి చల్లారింది. అట్టి మహా నాశనమునుండి నీ వెట్లు రాగలిగావు చెప్పు. నా మహా కావ్యంలో మిగిలిన సర్గను ఈ యుద్ధ వృత్తాంతంతో వ్రాసి ముగిస్తాను." ఇది విని శత్రుసైన్య వనకేసరి శ్రీ సమరసి ఇట్లు చెప్పసాగాడు. "కవీ! నీవు యుద్ధభూమిలో ఆర్యపతి

పృథ్వీరాజు ప్రక్కన లేవా? ప్రబల పరాక్రమంతో శత్రు సైన్యంలో హాహాకారాలు పుట్టింపలేదా! నీ తీక్ష్ణబాణాల ఎదుట ఒక్క క్షణం నిలువగలిగిన సమర్థు లెవరున్నారు? యుద్ధమెట్లు ముగిసిందో ఎవరికి విజయం లభించిందో నే నెట్లు నిర్ణయించగలను? నా మాట నీరసించిపోతూ ఉంది. వక్షస్థలం ప్రయ్యలౌతూ ఉంది. బలం క్షీణిస్తూ ఉంది. కాని ఒక్క క్షణం ఒకేఒక క్షణం సమర నృత్యంచేసి శత్రుప్రహారాల ఋణం తీర్చుకోవాలని ఉంది" ఇట్లు చెప్పి అతడు దుఃఖంతో నిట్టూర్పువిడిచి మౌనంగా కూర్చున్నాడు. అంతటా నిశ్శబ్దం ఆవరించింది. కీచురాళ్ళ ధ్వని ప్రతిధ్వనించింది. ఎండిన రావి కొమ్మపై కూర్చొని గ్రుడ్లగూబకూయ నారంభించింది. సరో వరం నీటిపై అలముకొన్న నాచును స్నానం చేసే వ్యక్తి చేతితో నెట్టివేసినట్లు అంధకారాన్ని వెన్నెల వెనుకకు నెట్టి వేసింది. ఒక వైపున తలవంచుకొని చందకవి, మరొకవైపున దెబ్బతిన్న సింహంవలె సమరసి కూర్చున్నారు. వృద్ధకేసరి సమరసి శరీరంనుండి రక్తపు చుక్కలు రాలుతున్నాయి. నూనె తగ్గిన దీపంలాగ అతని కాంతి తగ్గిపోతోంది. కాని అప్పుడు అతని భుజాలు అదురుతున్నాయి. మాటి మాటికి విరిగిన కత్తిని ఎత్తుతూ బాధతో మూల్గి క్రిందకు దింపు తున్నాడు. అప్పుడు చందకవి భయంకర గర్జనచేస్తూ మండప మంతా ప్రతిధ్వనించేట్లు "వీరరాఠౌరురాజా! తిరిగి ఒకసారి వెళ్ళి యుద్ధభూమి చూడవలెనని ఉంది. బహుశా ఆర్యపతి... అతని కంఠంనుండి మాట రాలేదు. తిరిగి సాహసం వహించి

"ఒకసారి వెళ్ళి మహారాజును, వీరశ్రేష్ఠుడైన కృష్ణ దేవుని, మహాసేనాపతిని, వెదకుతాను. వారిలో ఏ ఒక్కరు కనబడిన మరల సేనను సమకూర్చుకొని రేపు శత్రుసైన్యాన్ని స్వదేశంనుండి తరిమివేస్తాను. వీరకేసరీ! ఆర్యరక్తమంత చౌకకాదు. ఆర్యజాతి బలిదానం ఎప్పుడూ వ్యర్థం గాకపోదు."

అంతట సమరసి చల్లని నిట్టూర్పువిడిచి "కవీ! వెళ్లి స్వాతంత్ర రక్తసముద్రంలో మహారాజును వెదకు. సమస్త దేశ రక్తాన్ని త్రాగిన రాక్షసిలాంటి యుద్ధభూమినిచూడు. ఈ భయంకర అంధకారంలో ఉజ్వలభవిష్యత్తును వెదకు. అయ్యో నేడు ఆర్యపతి ఉష్ణరక్తంచేత ఆర్యభూమి సౌభాగ్య మంతరించింది. వీరుడా! విజయ సాధినియైన ఈ ఖడ్గాన్ని తీసుకో. ఈలోహంతోనే ఆర్యభూమి బంగారుగడ్డ అయింది. విధివిలాసంచేత నేడిది వక్రరేఖలాగ కన్పిస్తూ ఒకొప్పుడు ఈఖడ్గమే విదియనాటి చంద్రుడువలె విశ్వవందనీయమైంది." అనిరాణా సమరసిమౌనం వహించాడు. చందకవిఆలోచనా సముద్రంలో మునిగి ఏదో ఆలోచిస్తూఉన్నాడు భయంకర క్రూరమృగ ధ్వనులు వినబడుతున్నాయి. సమీపంలోనే శవాలతో నిండిన యుద్ధభూమి కుక్కల నక్కల భయంకర పోట్లాటలతో నిండి ఉంది. రాత్రి స్తంభించింది అప్పుడప్పుడు గాయపడిన సైనికుల ఆర్తనాదాలు వినబడుతున్నాయి. బహుశా అశక్తులైన ఆ సైనికుల మాంసాన్ని మాంసభక్షములైన మృగాలు చీల్చుతూండవచ్చు. అప్పుడప్పుడు దెబ్బలుతిన్న ఏనుగుల భయంకర ఘీంకారాలు వినబడుతున్నాయి. నిర్మలమైన తెల్లని వెన్నెల మరణించిన లక్షలకొద్ది వీరులపై శహ

చ్ఛాదన వస్త్రంలాగ వ్యాపించింది. సమరసి మెల్లమెల్లగ లేచి మహాకాళిపాదాలవద్ద చేరి భయంకర ఆర్తనాదంతో "రణచండికా! కాలము సమీపించింది. శలవు తీసుకొంటు న్నాను. కాని నాదొక కోర్కె. తిరిగి ఈ ఆర్యభూమిలో జన్మించి ఈమె ఋణాన్ని తీర్చుకోవాలి. వీరులకు ప్రియు రాలైన మృత్యువుకు నాస్వాగతం. పిరికివాడు పరాజయమనే విషాన్ని త్రాగి జీర్ణించుకొంటాడు. కాని స్వాభిమానం గల వాడు క్రుళ్ళి, క్రుళ్ళి కృశించి నశిస్తాడు."

## 2

అది తెల్లవారుజాము. జయచంద్రునికి శిబిరంలో నిద్రపట్టడంలేదు. మాటిమాటికి సురాపానం చేస్తూ వ్యాకు లత్వంతో, విచారంతో నటునిటు తిరుగుతున్నాడు. నేడు మద్యంకూడ అతనికి శాంతి నివ్వటంలేదు. సముద్రజలా న్నంతా త్రాగినా హృదయంలోని దుఃఖాగ్ని చల్లారుతుందా? కంటిలోబడ్డ ఇసుకకణం శరీరాన్ని, మనస్సును వ్యాకులపరు స్తుంది. కాని హృదయంలో గ్రుచ్చుకొన్న పదునైన బాణం ఎంత బాధను కలిగిస్తుందో అనుభవించినవారికి తప్ప ఇతరుల కెట్లా తెలుస్తుంది? తరంగాలతో నిండిన శత్రుసైన్య మహా సముద్రం అడ్డుకట్టకు జయచంద్రుడొక రంధ్రంగా తయా రయ్యాడు. ఆ రంధ్రంనుండి బయలుదేరిన మహాసముద్రం హోరుమంటూ సస్యశ్యామలమైన ఆర్యభూమిని గ్రామాలతో

పట్టణాలతో సహా ముంచివేసింది మూర్ఖుడైన జయచంద్రుడు శత్రువును ధైర్యంకోలిపి తన మాతృదేశానికి ఆహ్వానించాడు. అట్టి నీచునకు క్షేమమెలా కలుగుతుంది? ఒక్క అగ్నికణం గ్రామాన్నంతా కాల్చివేసినట్లు గృహకలహం భయంకర రూపాన్ని దాల్చింది. నిద్రపట్టక జయచంద్రుడు శిబిరంలో దుఃఖంతో దహింపబడుతూ తిరుగుతున్నాడు. ఒకప్పుడు ఏడుస్తున్నాడు. ఒకప్పుడు నవ్వుతున్నాడు. ఈ స్థితి చూచి కాపలావారు అనుమానంతో, భయంతో, మూగసైగలతో ఒకరికొకరు ఈ వృత్తాంతమంతా చెప్పుకొంటున్నారు. జయ చంద్రుడు కూట నీతితో విజయాన్ని సాధించాడు. కాని ఆత నికి శారీరక, మానసిక, సుఖశాంతులు మాత్రం దూరమై నాయి. విజయానికి ఫలితం గర్వమేకాని గర్వానికి శాంతి దూరంగా ఉంటుంది. శాంతి సత్యాన్ని, ఆత్మ బలిదానాన్ని, త్యాగాన్ని కోరుతుంది. కాని గర్వం ప్రపంచాన్ని మ్రింగ గోరుతుంది. కాబట్టి ఈ రెంటికి సమానత్వం, ఐకమత్యం ఏలా కుదురుతుంది. జయచంద్రుడు మనస్సులో ప్రతీకారం బలంగా ఉన్నపుడు "మేము విజయాన్ని సాధించాము"ని ఉప్పొంగిపోతాడు. కాని శరీరంలో ఆర్యరక్తం ఉత్తేజిత మైనప్పుడు పశ్చాత్తాపాగ్నితో కుమిలిపోతున్నాడు. ఈ విధంగా భయంకర ఆఘాత ప్రతిఘాతాలతో వ్యాకులత్వం చెంది రాత్రంతా మద్యపానంతో గడిపివేశాడు. అయినా అతనికి శాంతి లేదు. పైగా చింత నాల్గురెట్లెక్కువయింది.

కోళ్ళు కూసినాయి, గుర్రాలు సకిలించాయి. ఏనుగులు ఘీంకరించాయి. చల్లనిగాలి సాగింది. నిశాదేవి దుఃఖంతో

నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది. ఒక్కొక్క నక్షత్రము భయంతో అదృశ్యమైపోతూవుంది పరాధీన భారతదేశ ప్రాంగణంలో ప్రథమ ప్రభాతం దుఃఖంతో బయలుదేరి వచ్చింది. తెల్లవారింది. ద్వారపాలకుడు వచ్చి "ప్రభూ! పాదుషాగారి దూత ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నాడు" అని విన్నవించాడు. జయ చంద్రుడు కొంచవూగి "లోనికి పంపు"మన్నాడు. అతని శంకిత హృదయం కంపించింది. గోరీ జయచంద్రుని వెంటనే రమ్మని కబురు చేశాడు.

యుద్ధభూమికి దూరంగా దుర్గమారణ్యంలో శత్రు సేనల శిబిరాలు లక్షలకొలది సముద్ర తరంగాలవలె కనబడు తున్నాయి గుర్రాలు, ఏనుగులు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. సైనికుల సంఖ్య కంతులేదు. నేడు శత్రుసేన విజయోత్సవాన్ని జరుపుకొంటూ ఉంది. వీరు వున్మత్తులై వీర తాండవం చేస్తున్నారు. దిక్కులు పిక్కటిల్లేట్లు రణవాద్యాలు ప్రతిధ్వనిస్తున్నాయి. ఈవిధంగా ఆర్యభూమియొక్క రొమ్మును కాలదన్ని భారతవిజేతగోరీ విజయోత్సవాన్ని జరిపిస్తున్నాడు. విశాలమైన గోరీ దర్బారులో రక్షక భటులు వరలేని కత్తులు కవచాలు ధరించి భయంకర యమభటులవలె తిరుగు తున్నారు. కళ్లు మిరుమిట్లు గొల్పుతున్నాయి. హృదయాలు కంపిస్తున్నాయి. పదాఘాతాల చేత భూమి గజగజ వణకుతూ ఉంది. మృదువైన పారసీక కంబళ్ళు పరచి ఉన్నాయి. దళ పతి, సేనాపతి, యుద్ధపతి పంక్తులు దీరి వీరభావాలతో మోకాళ్లుముడుచుకొని ఎదుట ఖడ్గాలనుపెట్టి ఖడ్గమృగచర్మం చేత తయారయిన కవచాలను ధరించి కూర్చున్నారు. మేఘ

నాద కుంభకర్ణాది వీరులతో రావణాసురుడు సభదీర్చినట్లుంది రత్నాలు పొదిగిన అందమైన చాందినీ నిర్మింపబడింది. స్వర్ణ సింహాసనంమీద యవనపతి గోరీ ఆశీనుడై ఉన్నాడు. ఎడమ వైపున తల వంచుకొని జయచంద్రుడు కూర్చున్నాడు. గోరీనిఆనందపెట్టాలని అతడనుకొన్నాడు. కాని హృదయంలో రగుల్కొనే నరకాగ్ని ధూమంతో అతనిముఖం నల్లబారింది. బంగారు స్తంభంమీద గోరీ పతాకం, దేశ వక్షస్థలంపై పాము దొర్లుచున్నట్లు రెపరెపలాడుతూ ఉంది. అప్పుడు గోరీ "జయచంద్ర మహారాజా! తమదయవల్ల మేమిక్కడ విజయాన్ని పొందగలిగాము. దూరదేశస్థులమైన మాకు మీ అమూల్య సహాయం లభించింది. మేము తమకు కృతజ్ఞులం. నేడొక మహాశత్రువు అంతరించాడు. గాలిఊపులకు చెదిరిన మేఘాలవలె ఈ దేశసైన్యం చిందరవందరమై నశించిపోయింది. ఈ వీరుల పరాక్రమంచేత ఈ దేశంలో శత్రువులు లేకుండా చేయగలిగాను. నేడీదేశం నా పాదాక్రాంతమైంది. దీనిని మట్టిలో కలపటానికైనా, క్షమించటానికైనా నాకు సంపూర్ణహక్కుంది. ఈ పిరికి దేశంలో నేడు నన్నొకక్షణం ఎదుర్కొనగల సమర్థుడెవడున్నాడు? అయినా నేను శత్రు శౌర్యాన్ని మెచ్చుకొంటున్నాను. విజయం సాధించకపోయినా గౌరవమైన ఓటమినే పొందారు."

అని గర్వంతో నాల్గువైపుల జూచి మౌనంగా కూర్చున్నాడు. అక్కడ కూర్చున్న వారంతా ఇదివిని గర్వంలో ఉప్పొంగిపోయారు. కొందరు వీరులు రణోన్మత్తులై కోపంతో వరలనుండి కత్తులు లాగారు. కరకుకవచాలు మెరిశాయి. ఆ

ధ్వని సింహగర్జనవలె అరణ్యమంతా ప్రతిధ్వనించింది. భూమి కంపించింది. జయచంద్రుడు సిగ్గుతో తల వంచుకొన్నాడు. మరల గోరీ,

"మహారాజా! మనం మిత్రులం నేడు కలిసి మెలసి విజయోత్సవం జరుపుకొందాము. యుద్ధం సమాప్తి చెందింది కాని ఈ వీరుల యుద్ధవాంఛ ఇంకా మిగిలిపోయింది. మరొక సారి యుద్ధభూమిలో ఈ వీరసింహాలను గర్జించి ఎదుర్కొన గలిగిన వీరు లెవరున్నారు." అని అన్నాడు. జయచంద్రుడు తడి ఆరిన గొంతుతో "ఎవరూ లేరు. తమతో యుద్ధము చేయు వారెవరూ లేరు, నేడు భారత వసుంధర వీరశూన్యమైపో యింది. వీరభూమి నేడు పరాధీన అయింది. సరిగా నేడు పాదుషాగారి పాదాక్రాంతమై తేజోహీనమై మూర్ఛబడిపో యింది. ఆర్యభూమి తమదయకు ఆశ్రితురాలయినప్పటికి ..." అని అకస్మాత్తుగ భయంతో జయచంద్రుడు మౌనం వహిం చాడు. అప్పుడు గోరీ మహారాజా! "అయినప్పటికి" అన్నావు నీ భావమేమి?" అన్నాడు. జయచంద్రుడు "అయినప్పటికి అంటే తమకు దయామూర్తులనిమాత్రం మాకు నమ్మకం ఉంది."

గోరీపండ్లుకొరికి ఆగిపోయాడు. ముఖంపై క్రోధ మేఘం వ్యాపించి వర్షించకుండానే చెదిరిపోయాయి. తిరిగిగోరీతీవ్ర స్వరంతో "సామ్రాట్టును ఇనుపగొలుసులతో బంధించి తీసు కరండి" అన్నాడు. జయచంద్రుని రక్తంఉడుకెత్తింది. కానిఅవ మానం చేత తలవాల్చికూర్చుండి పోయాడు. మదపుటేనుగు వస్తున్నట్లు దూరంగా ఇనుపగొలుసుల శబ్దమైంది సభంతా

స్థభించింది. వీరుల హృదయాలు కంపించాయి. గోరీకూడ జాగ్రత్తగా కూర్చున్నాడు. జయచంద్రుడు సిగ్గుతో, అవమానంతో క్రుంగిపోతున్నాడు. భయకంపితులైన సైనికులు చేత కత్తులు ధరించి జాగ్రత్తగా సామ్రాట్టును చుట్టుముట్టి వస్తున్నారు. వారు వచ్చుట తోడనే అందరు భయంతో లేచి నిలబడ్డారు. ఇనుప గొలుసులచే బంధింపబడ్డ ఢిల్లీపతి పృథ్వీరాజు దర్బారు లోనికి ప్రవేశించాడు. మెలిదిరిగిన మీసాలు, ఉక్కు స్తంభాలవంటి భుజదండాలు, రాతివంటి వక్షస్థలం, సన్నని నడుము, ఉన్నత శరీరం, వంకర తిరిగిన కనుబొమలు, డేగ కన్నులవంటి చురుకైన కన్నులు, గంభీరగమనం, అడుగడుగున హృదయంలోని క్రోధం ధ్వనిస్తూఉంది. రూపెత్తిన మృత్యువో యన్నట్లు నిలబడియున్నాడు. కాళ్ళు, చేతులు సంకెళ్ళతో బందింపబడ్డాయి. తలపై విచ్చుకత్తులు మెరుస్తున్నాయి. సైనికులంతా దూరదూరంగా తొలగి నిలబడ్డారు. అగ్నిజ్వాలవంటి దృష్టిని అతడేవైపు సారించిన ఆ వైపున నున్న వీరులు వెనుకకు తొలగిపోసాగారు. మృత్యుస్వరూపుడైన ఆ వీరుని ఎదుట నిలువగల సమర్థుడెవడున్నాడు. పృథ్వీరాజు రోషంతో "గోరీ! నీ అభిప్రాయమేమిటి? ఎందుకు నన్నిచ్చటికి పిలిపించావు? నీ ప్రక్కన స్వర్ణసింహాసనంమీద గర్వంతో కూర్చున్న దేశద్రోహి, పిరికిపంద, నిన్నటి యుద్ధంలో ఎక్కడ ఉన్నాడు? నిన్న యితడు కన్పించినచో పరాజయమనే పశ్చాత్తాపం లేకపోయేది. దేశద్రోహానికి ఫలితమేమో ప్రపంచం చూచేది" అని సింహంవలె గర్జించి ఆగిపోయాడు. అప్పుడు గోరి "జయచంద్ర మహారాజుపై

ఇది అర్థంలేని అపవాదు. ఈత తెలియని మూర్ఖులు తాను మునిగిపోయి దోషాన్ని ప్రవాహంపై వేస్తారు. తమరు కొంచెం ఆలోచించండి" అన్నాడు. సింహంవలె గర్జించి పృథ్వీరాజు. "గోరీ! జాగ్రత్త. జయచంద్రుడు తన తల్లికి నిజమైన పుత్రుడే అయితే ఇట్లు నామాతృభూమిపై ఎన్నటికి కాలుపెట్టేవాడివికాదు. కృతఘ్నుడా! ఆరుసార్లు నిన్నుబంధించి క్షమించి తిరిగి స్వదేశానికి పంపిన విషయం మరిచావా! ఆర్యులు పుట్టగానే కత్తులతో ఆడుకొంటారు. వారికి విజయంలో ఆనందంగాని, పరాజయంలో శోకంగాని కలుగవు. కాని ఎదురుగా ఈ దేశద్రోహిని చూస్తూఉంటే నా హృదయం దహించుకొని పోతున్నది. ఇతనిని నా దృష్టి నుండి తొలగించు." అన్నాడు. సభయావత్తు పిడుగువలె ప్రతిధ్వనించింది. వీరులంతా ఒకరినొకరు నెట్టుకొని వెనుకకు పోయారు. పారిపోవజూచే జయచంద్రునితో గోరి "ఛీ! ఛీ! మహారాజా! ఈ వీరత్వంతోనే చేతకత్తి ధరిస్తున్నారా! తన చోటునుండి కదలలేని ఈబంధితుడు తమకేమిహానిచేయగలడు" అని పృథ్వీరాజుతో "ఢిల్లీపతీ! ఇక ముందు తమరెప్పుడు పౌర పాటునకూడ వీరశ్రేష్ఠుడైన జయచంద్ర మహారాజును చూడ కుండునట్టి ఏర్పాటు చేస్తున్నాను ఓరీ! రెండు ఇనుపచువ్వ లను ఎర్రగా కాల్చి తీసుకొనిరండి ఢిల్లీశ్వరుని కండ్లను పీకి వేయండి" అన్నాడు గోరీ ఆదేశాన్ని విని జయచంద్రుడు ఏదో చెప్పదలచాడు. కాని భయంతో కంఠం ఆగిపోయింది. నోటమాటరాలేదు. అన్యాయాన్ని క్రియరూపంలో ఎదు ర్కొనగల సాహసం పతిత హృదయాలకు కలుగదుగదా!

పృథ్వీరాజు "యవనపతీ! సంకెళ్ళలో బంధించి అత్యాచారం చేయడం వీరోచిత ధర్మం కాదు. నీవు చేయబోయేది పిరికి వారి పని. నీ యీ నడవడిని ప్రపంచ మెప్పుడు మన్నించదు. సాహసం ఉంటే సంకెళ్ళు విప్పి కత్తినిచ్చి ఎదుట నిలబడు. అప్పుడు చూడు. ఒక్క క్షణంలో ఆర్యభూమికి విజయం తిరిగి వస్తుందో లేదో!" అని మహాయోధుడైన పృథ్వీరాజు ఒక్క ఊపు ఊపాడు. ఇనుపగొలుసులు తునాతునకలై వడగళ్ళ వలె క్రిందరాలాయి. గర్జిస్తూ సంకెళ్ళ నొక్కక్షణంలో త్రెంచివేశాడు సభంతా మెరుపు మెరిసినట్లయింది. యోధు లందరు భయంతో శస్త్రాస్త్రాలనొదిలి ఒకరి నొకరు త్రొక్కు కుంటూ పారిపోయారు. శిబిరమంతా హాహాకారాలతో నిండి పోయింది. లేళ్ళ గుంపుల మధ్య సింహం దూకినట్లు సభంతా చిందర వందరయింది. గోరీ పారిపోయాడు. యుద్ధవీరులు శస్త్రాస్త్రాలు తీసికొని సభను చుట్టివేశారు. ప్రాణాలతో పట్టుకోండని గోరీ ఆజ్ఞాపించాడు. కాని బంధముక్తుడై చేత కత్తి ధరించి యమునివలె జూపట్టు నా వీరునియొద్ద కెవరు పోగలరు. పృథ్వీరాజు వెంటనే జయచంద్రుని పంపించు వానిని వధించి ఆర్యభూమికళంకాన్ని రూపుమాపుతాన" న్నాడు. ఆ రౌద్రమూర్తిని జూచి సైనికులంతా స్తంభించి పోయారు. ఒక్కొక్కరి హృదయం ఆకువలె కంపించి పోయింది. చుట్టూ గోరీసేన, మధ్య ఢిల్లీపతి రుద్రతేజంతో అతడేవైపునకు వెళ్ళునో ఆ వైపున మెరుపు మెరిసినట్లై గోల చెలరేగిపోతోంది. కొంతమంది సాహసులైన వీరులు ఉచ్చులు తెంచి మదపుటేనుగులతో చుట్టుముట్టి ఆ సింహాన్ని

పట్టటానికై ప్రయత్నింపసాగారు. కాని ఏనుగులు అంకుశం పోట్లు తిని ఘీంకారాలు చేస్తూ భయంతో తొలగిపోసాగాయి. అగ్నిజ్వాలవంటి వజ్రాయుధాన్ని చేత ధరించి ఇంద్రుడు మేఘాలతో ముట్టడించినట్లు ఆర్యపుత్రుని ఖడ్గం కండ్లను మిరుమిట్లు గొలుపుతూ మెరుపువలె మెరసిపోతోంది. కత్తి దెబ్బలకు అనేక వీరుల శిరస్సులు, ఏనుగుల తలలు క్రింద దొర్లుతూ ఉన్నాయి. మధ్యాహ్నమయింది. ఆకాశ సూర్యుడు తన స్వర్ణ రథాన్ని ఆపి ఆరిపోయే స్వదేశ దీప కాంతి చూడసాగాడు. ప్రకృతి యుద్ధఫలితాలను శ్వాసనాపి చూస్తున్నట్లు గాలి స్తంభించింది. ఒకవైపు మధ్యాహ్నం సూర్యుడువలె ఆర్యవీరుడు పృథ్వీరాజు ప్రకాశిస్తూఉంటే, మరొకవైపున సూర్యుని ఎదుట వెలవెలబారే నక్షత్రాల్లాగ గోరీ సైన్యమంతా తేజోహీనమైంది. గోరీ కలవరపడ్డాడు. ఒక్కసారి వీరులందరు గోలచేస్తూ విరుచుకొనిపడి ఉచ్చులు విసరి ముట్టడించారు వేలకొలది యమపాశములవంటి పట్టు త్రాళ్ళను ఎంతవరకు నరుకుతారు. చూస్తూ చూస్తూ ఉండగానే ఆ వీరుడు ఆంజనేయుడు బ్రహ్మాస్త్రానికి కట్టుబడిపోయినట్లు బంధింపబడిపోయాడు. ఆర్యపుత్రుని అవయవాలన్నీ బంధింపబడ్డాయి. శత్రుసైన్యంలో ఉల్లాసం ఉప్పొంగింది. కాని ఏ వీరులు ఎదుట వెళ్ళటానికి సాహసించలేక పోతు తున్నారు. శత్రుగర్వ మర్దనుడైన ఆర్యభూపుత్రుడు ఉచ్చులలో చిక్కుకొని నేలపై బడిపోయాడు, అప్పుడు గోరీ చేత ఖడ్గంధరించి భయంతో గోరియును వ్యాకులత్వం జయచంద్రుడును వచ్చారు. గోరీ "ఆహా! ఢిల్లీపతి దుమ్ములో

దొర్లుచున్నారే ! తమరు మహారాజులు, వీరులు లేవండి. మా దుష్టత్వాన్ని మన్నించండి" అని ఎత్తిపొడిచాడు. ఆర్య సింహం పండ్లు కొరుకుతూ "నీవు నీ కోర్కెను పూర్తిచేసుకొని వాగ్బాణాలతో నన్ను గాయపరచకు. విధివ్రాత నెవరు తప్పించగలరు" అన్నాడు. గోరీ "మహారాజా ! ఇప్పుడు కోర్కెను త్వరగా పూర్తిచేస్తాను. ఓసీ ! త్వరగా వెళ్ళి రెండు ఇనుప చువ్వలు ఎఱ్ఱగ కాల్చి ఈ మహారాజు కండ్లను పీకివేయండి" అన్నాడు. పృథ్వీరాజు "ఆహా ! భారత వసుంధరా ! ఆర్యావర్తమా ! ఒక్కసారి నీ సౌమ్యమూర్తిని కండ్లార చూడనీ. సస్యశ్యామలమైన నీ స్వరూపాన్ని చూడనిమ్ము. విశాలమైన పొలాలను, బంగారంవంటి ధాన్యపుకుప్పలను ఒకసారి చూడనీ ఆర్యజాతి విజయానికి, వైభవానికి ఈ సూర్యభగవానుడే సాక్షి. నేడు ఆర్యభూమి వినాశానికి పరాజయానికి అతడే సాక్షి. నేడు భారతదేశ సూర్యోదయాన్ని చూడగలిగాను, కాని అస్తమయాన్ని చూడజాలను. అది నా పాలిట అదృష్టమే" అన్నాడు. ఇంతలో ఎఱ్ఱగా గాల్చిన ఇనుప చువ్వలు భటులు తెచ్చారు. కండ్లలో గ్రుచ్చండి అని గోరీ కేకలు వేశాడు. కాని పృథ్వీరాజు భయంకర దృష్టిని చూచి కటికవారు కూడ కంపించిపోయారు. గోరీ మరల గర్జించి "అసమర్థులారా ! ఏమిభయం. కండ్లలో గ్రుచ్చండి ఆలశ్యం చేశారా మీచర్మం ఒలిపిస్తాను" అన్నాడు. కటికవారు పరుగెత్తి చక్రవర్తి రొమ్ముపై నెక్కి కండ్లు మూసుకొని వణకుచున్న చేతులతో ఎఱ్ఱగా కాల్చిన ఇనుప చువ్వలను కండ్లలో గ్రుచ్చారు. చిటపట శబ్దంతో

పొగ బయటకు వచ్చింది. రక్తధార జలయంత్రంలాగ పైకి చిందింది. జయచంద్రుడు కండ్లు మూసుకొని పెద్ద నిట్టూర్పు విడిచి వెనుకకు వెళ్లిపోయాడు. కాని తన మనోనేత్రాన్నెట్లు మూయగలుగుతాడు? అతని కండ్లఎదుట రెండు చిత్రాలు కనిపించాయి. మొదటిది స్వతంత్ర ఆర్యజాతి చిత్రము. రెండవది నేటి అసహ్యకర చిత్రం. మొదటి చిత్రానికి స్వాభిమానమనే రంగు. రెండవదానికి అవమానమనే నల్లని రంగు వేయబడి ఉన్నాయి. రెంటిని ఎదుట నుంచుకొని నిట్టూర్పు విడిచి జయచంద్రుడు వ్యాకుల హృదయంతో చూడసాగాడు.

పృధ్వీరాజు నోటనుండి "అబ్బా" అనే శబ్దంకూడ రాలేదు. వారి కన్నులతోపాటు ఆర్యభూమి అదృష్టంకూడ నశించిపోయింది. క్రోధంతో పృధ్వీరాజు "గోరీ నీవు చాల మంచిపని చేశావు. ధన్యవాదం. ఇక ఈ జన్మలో నీచేత త్రొక్కబడిన పవిత్ర ఆర్యభూమిని చూడజాలను" అన్నాడు.

# 3

తూర్పు దిక్కున రమ్యమైన ఎర్రదనం వ్యాపించింది. గూళ్ళలోని పక్షులు మేల్కొన్నాయి. లోకమంతా చైతన్యంతో నిండిపోయింది. (సూర్యుడనే సింహం కనబడటంతోడనే అంధకారమనే ఏనుగు ఘోరారణ్యంలోనికి పారిపోయింది.)

విశాలమైన యుద్ధభూమిలో వీరుల శవాలు ఒకదానిపై ఒకటి పడి కనిపిస్తున్నాయి. ఇంద్రుని వజ్రాయుధంచేత ముక్కలు ముక్కలు చేయబడ్డ పర్వతంలాగ లక్షలకొలది వీరులు మృత్యువాతపడి ప్రాణాలు కోల్పోయి పడివున్నారు. అక్కడక్కడ కత్తులు, కవచాలు ధనుర్బాణాలు, గొడ్డళ్ళు మెరుస్తున్నాయి. ఏనుగు అంబారీలు విరిగి కుప్పలు కుప్పలు పడిఉన్నాయి. భయంకర తుఫానుకు కూలిన వృక్షాల్లాగ ఏనుగులు ప్రాణాలు కోల్పోయి కొండలవలె గుంపులు పడి ఉన్నాయి. ఒక్కొక్క ఏనుగు లేస్తూ పడుతూ ప్రాణాలు వదులుతూ ఉంటే భూమి కంపించిపోతూ ఉంది. చందకవి యుద్ధభూమి అంతా కలయదిరుగుతున్నాడు. అతనికి మబ్బు తునకలాగ పృథ్వీరాజు గొడుగు కనిపించింది. ఒకనాడు దీని సుఖప్రదమైన నీడన దేశమంతా సురక్షితంగా నిద్రపోతూ ఉండేది. ఒకవైపు రాజదండం ముక్కలు ముక్కలై నేలపై పడిఉంది. ఒకవైపు చామరం పడివుంది. మరొకవైపు ఆర్య ధ్వజాన్ని ధరించే సైనికుడు జండా కర్రను గట్టిగా పట్టుకొని మృత్యువాతపడి ప్రాణాలు గోల్పోయాడు. ఒకానొకప్పుడు ఆ జెండా విజయచిహ్నంగా ఉండేది. అదే నేడు పరాజయా నికి చిహ్నంగా తయారయింది. కోట్లకొలది ఖడ్గాలు దాన్ని రక్షిస్తూ ఉండడం ప్రపంచానికి తెలుసు కాని నేడు విధి వైప రీత్యంచేత ఒక చిరిగిన గుడ్డముక్కవలె శత్రుసేన కాళ్ళలో త్రొక్కబడి నేలపై పడిఉంది. కవీంద్రుడా జండాను వంగి తీసుకొన్నాడు. కండ్ల కద్దుకొన్నాడు. దానిని తలకు చుట్టు కొని "ధ్వజరాజమా! నీ గొప్పతనాన్ని పోగొట్టుకొని

దుమ్ములో పడియున్నావా! ఆర్యజాతికి అవమానకరం. నీవు నీలాకాశంలో ఎగురుతూ ఉంటే సూర్య చంద్రులు గర్వంతో హారతియిస్తూ ఉండేవారు. సముద్రుడు నీపాదాలను కడుగుతూ వుండేవాడు. మేఘాలు ఆకాశంపై గొడుగులాగ శోభిస్తూ ఉండేవి. మెరుపులు నాట్యం చేస్తూ నీకు ప్రాణాలర్పిస్తూ ఉండేవి. నేడు భయంకర యుద్ధంలో పాదాలక్రింద నలిగి పోయావు. భారతదేశాని కలంకారమైన నీవు మృత్యు సముద్రంలో మునిగిపోయావు" అని చందకవి వ్యాకులత్వంతో కన్నీరుపెట్టాడు.

ఆర్యలక్ష్మి భారత వసుంధర విషాదంతో దుఃఖింప సాగింది. చందకవి పృథ్వీరాజును వెదుకుతూ గాయాలతో మూల్గినవీరుల మధ్యనుండి ముందుకుసాగాడు. కొద్దిదూరంలో ఢిల్లీపతి ఏనుగు కనిపించింది. దాని రోమరోమాన లక్షలకొలది బాణాలు గ్రుచ్చుకొనియున్నాయి. వజ్రంవంటి దంతాలు విరిగిపోయినాయి. తొండం మొదలంటా నరుకబడింది. కొద్దిగా ప్రాణాలుమాత్రం మిగిలి ఉన్నాయి. మాటిమాటికి లేస్తూ పడుతూ రోషంతో భయంకర ఘీంకారం చేస్తూఉంది. నాల్గువైపుల శత్రుసైనికులు కుప్పలు కుప్పలుగ పడిఉన్నారు పృథ్వీరాజును ముట్టడించి శత్రువులు ఎటువంటి ఘోరయుద్ధం చేసారో చందకవికి తెలిసిపోయింది. ఆ ప్రక్కనే దేవాసురుల యుద్ధంలో దేవేంద్రుని ధనుస్సు విరిగి పడిపోయినట్లు పృథ్వీ రాజు ధనుస్సు రెండు ముక్కలై పడింది. కవిహృదయం కలతచెందింది ఆ ధనుస్సును ప్రేమతో ఎత్తి ముద్దు పెట్టుకొని మహాదుఃఖంతో హృదయానికి హత్తుకున్నాడు. చంద

కవికి పరిస్థితిఅంతా అర్థమయింది. చింతాముగ్ధుడై దుఃఖంతో ముందుకు సాగాడు. ఏనుగువంటి ఒక వీరుడు నేలపై బడి ఉన్నాడు. అతని కవచం ముక్కలు ముక్కలై వుంది. శిరస్త్రాణం చూర్ణమైపోయింది. రక్తం సెలయేరులాగ ప్రవహిస్తూఉంది. అతని చుట్టూ పడివున్న అస్త్రాలు, ఖడ్గాలు, ఏనుగులు చూస్తే శత్రువులు పట్టుబట్టి వ్యూహంపన్ని ఆ వీరుని వధించినట్లు కనబడుతూఉంది. యుద్ధభూమిలో అభిమన్యునివలె పడియున్న ఆ వీరుడెవరా అని చందకవి జాగ్రత్తగ పరిశీలించాడు. అతని కనిగ్రుడ్లు పైకితిరిగి ఉన్నాయి. వాటిని చూచి భయంతో నక్కలుకూడ దగ్గరకు రావడం లేదు. వెంటనే చందకవి "కన్హదేవు"డని గుర్తించాడు. యుద్ధంలో యమునివంటి పరాక్రమశాలి ఆర్యభూమియొక్క మూర్తీభవించిన ధైర్యం ఆర్యజాతికి ఆధారభూతుడు. అట్టి మహాబలశాలి చంపబడి యున్నాడు. అతడు ఒంటరిగా అనేక మారులు యుద్ధభూమిలో దూకి హుంకారంతో హూణులను తరిమి వేశాడు. నేడు ప్రాణాలు గోల్పోయి రక్తపు బురదలో కదలక పడియున్నాడు. చందకవి హృదయంలోని సాహసం ప్రబుద్ధమైంది. దేశాన్ని ఉద్ధరించాలి అనే ఆశ అడుగంటింది. 'అయ్యో' అని ఆ వీరుడు తలబట్టుకొని కూర్చున్నాడు.

# 4

పడమటి దిక్కున పగలు అనే చితి ప్రజ్వరిల్లింది. దాని పొగచేత అంధకారం వ్యాపించింది. యదువంశ సర్వ నాశనాన్ని తన కండ్లతో చూచి తిరిగివచ్చు అర్జునునివలె చందకవి దేవీమందిరానికి తిరిగి వచ్చాడు. రక్తంచేత తడిసి, ధూళిచేత నిండిన ఆర్యజాతి జెండాను తలకు చుట్టుకొన్నాడు. మత్తెక్కిన వానివలె ఒక్కొక్క అడుగు వేస్తున్నాడు. రాణా శ్రీసమరసి ఇచ్చిన ఖడ్గం నడుమున అనాధవలె వేలాడుతూ ఉంది. చందకవి ఆలోచనా సముద్రంలో మునిగి ఉన్నప్పటికి అడుగులుమాత్రం అభ్యాసవశంచేత సరిగానే పడుతున్నాయి ఈవిధంగా చందకవి దెబ్బతిన్న సింహంవలె చండికా మంది రంలో ప్రవేశించాడు. శ్రీసమరసి చండికా పాదాలకు చుట్టు కొని పడిఉన్నాడు. దెబ్బలుతిన్న శరీరాన్ని చండికాదేవి పాదాల కర్పించి ధీరుడైన సమరసి స్వర్గలోకానికి వెళ్లిపో యాడు. కవి హృదయానికి పిడుగువంటి ఒకదెబ్బ తగిలింది. క్షణంసేపు నిశ్శబ్దంగా ఉండి తరువాత పెద్దగా వికటంగానవ్వి కూర్చున్నాడు. - "అయ్యో మానవుడు దిరిశన పువ్వుకంటె కోమలమైనవాడు. కాని బ్రహ్మదేవుడు వజ్రంవంటి కఠిన హృదయ మిచ్చాడు. ఏ కన్నులనుండి కరుణారసం పవిత్ర ఆకాశగంగవలె ప్రవహిస్తుందో ఆ కండ్లనుండి సర్వాన్ని

భస్మంచేసే ప్రళయాగ్నిజ్వాల ప్రజ్వరిల్లుతుంది." అని చంద కవి "ఓ ! కపాల మాలినీ ! లోక సంరక్షిణీ ! తల్లీ ! ఏదోషం వల్ల నీవింత కోపగించావు ? బంగారువంటి ఈ దేశాన్ని స్మశానం చేశావు. సర్పంలాగ నీ సంతానాన్నే భక్షించావు. "జగన్మాత" అనే శబ్దాన్ని సిగ్గుపరచావు. దీనుల రక్షింప లేని నీవు చేతిలో కత్తి నెందుకు ధరించావు. చెప్పు చండికా మహిషాసురమర్దనీ ! చెప్పు. నేడు నీ ప్రతిష్ట బూడిదపాలై పోతూ ఉంది." అని గర్జించాడు. వెంటనే మందిరంలో పిడుగు పడినట్లు ధ్వని కలిగింది. అగ్నిజ్వాలవలె మెరుపు కండ్లను మిరుమిట్లు గొలిపింది మహాకాళి చేతినుండి ఖడ్గం నక్షత్రంవలె క్రిందపడింది. వెంటనే ముక్కలు ముక్కలై పో యింది. మందిరమంతా భయంకర ధ్వనితో ప్రతిధ్వనించింది. చందకవి చకితుడై ఉలిక్కిపడి చూచాడు. విగ్రహం మంచు బిందువులాగ గజగజ ఒణికిపోతూ వుంది. సువాసన పొగతో మందిరమంతా నిండిపోయింది. ఆకాశంలో దేవదుంబుభులు వినిపించాయి. చందకవి గద్గద స్వరంతో జగదాంబకు నమ స్కరించి—"తల్లీ ! దయామయీ ! దుఃఖ వ్యాకులతనొందిన నా అపరాధాలు క్షమింపుము దేవీ ! ఈ కండ్లతో ఆర్య భూమి వైభవాన్ని చూచాను, అనేకసార్లు యుద్ధభూమినుండి తిరిగివచ్చు ఆర్య మహాసేనకు స్వాగత మిచ్చాను. విజయ చిహ్నమైన ఆర్య ధ్వజానికి హారతి నిచ్చాను ఈ కండ్లతోనే నిన్న దేశ వినాశాన్ని చూచాను. ఎదురు దెబ్బకు చూర్ణ మైన పర్వతరాజును చూచాను. గుప్పెటతో వేసిన నిప్పు యొక్క శగకు ఏడుసముద్రాలు ఎండుట చూచాను. అందులో

అసంభవమేమీ లేదు. కాని దేవీ! హృదయం దహించుకొనిపోతోంది" అని ధీరుడైన చందకవి కొంతసేపు చింతా మగ్నుడై కూర్చున్నాడు. తరువాత పెద్ద నిట్టూర్పు విడిచి నాల్గువైపుల జూచి — దురదృష్టవంతమైన ఆర్య భూమాతా భారతదేశానికి ఆధారభూతుడైన ఈ నీ వీరపుత్రుడు చిరనిద్ర పోయాడు. శత్రువులకు భయం తొలగిపోయింది. ఓ విదేశస్థులారా! రత్నాలతో నిండిన ఈ దేశాన్ని దోచుకోండి. తలుపులు తెరువబడ్డాయి. మిమ్మల నెదుర్కొనే వీరులెవరూ లేరు" అని చందకవి కన్నీరు తుడుచుకొన్నాడు. రాణా సమరసి శవాన్ని భుజంపై వేసికొని యుద్ధభూమి మధ్యకు తీసికొని పోయాడు?

నరమాంస భక్షులైన పశుపక్ష్యాదులు గుంపులుగుంపులుగ ఉన్నాయి. లక్షలకొద్ది గ్రద్దలు ఆకాశంలో ఎగురుతున్నాయి వాటిరెక్కలనీడకు అంధకారం వ్యాపించింది. చందకవి ఒకసారి దుఃఖంతోమూల్గి బాణాలతోను, విరిగి, ముక్కలైన ధనుస్సులతోను, పెద్దచితి పేర్చాడు. తల నున్న ఆర్యధ్వజాన్నితీసి శవానికిచుట్టాడు. సమరసి తనకిచ్చిన ఖడ్గాన్ని ఒకప్రక్కనుఉంచాడు. భక్తితో నమస్కరించి— "మహారాజా! సుఖంగానిద్రపో. భయంకరమైన మహాంధకారం వ్యాపించింది. పిశాచాలు— నిద్రమేల్కొని వెళ్ళిపోతున్నాయి. భారతదేశ సూర్యుడస్తమించాడు. ఆర్యుల ఆత్మత్యాగమెప్పుడూ వ్యర్థంకాదు ప్రపంచంలో ఒక్కఆర్యుడైనా మిగిలిఉంటే, ఆర్యభూమి ఈవిధంగా తేజోవిహీనమై కళంకితమై, పరాధీనమై ఉండజాలదు. ఆర్యవక్తంలోని ఒకొక్క

చుక్క కాలాగ్నిగా తయారై శత్రువులను నాశనంచేసి వేస్తుంది" అని విరిగినకత్తిని రాతిముక్కతో రాపిడిచేసి నిప్పును తయారుచేశాడు. చూస్తూచూస్తూ ఉండగానే చితాగ్ని జ్వాలలతో దిక్కులన్నీ నిప్పు అంటుకొన్నట్లు పొగతో నిండిపోయాయి. కొంతసేపటికి భక్తితో నమస్క రించి ఆవీరుని భస్మాన్ని తీసికొని చందకవి నిశ్శబ్దంగా అరణ్యంలోకి తిరిగివచ్చాడు.

శ్రీ

జయచంద్రుడు శాంతభావంతో సభలో కూర్చు న్నాడు. కానీ అతని హృదయం అగ్నిపర్వతంలాగ ఉంది. స్తంభాలలో రకరకాల రత్నాలు ప్రకాశిస్తున్నాయి. కండ్లు మిరిమిట్లు గొల్పుతున్నాయి. ముత్యాల దండలు కూర్చిన పట్టుగొడుగును పట్టుకొని మన్మధునివంటి ఒక సేవకుడు నిల బడి ఉన్నాడు. క్రీగంటి చూపులతో, యౌవ్వనం తొణికిస లాడే అప్సరసలవంటి అందమైన దాసీలు చామరాలు వీస్తు న్నారు. అందంగా నాట్యశాలవలె సభ అలంకరింపబడిఉంది. వికసించిన పూలవాసనలతో వసంతవాయువు బయలు దేరింది. దూరంగా కోకిల కూతలు వినిపిస్తున్నాయి. గాయకురాండ్రు కోకిల స్వరాలలో పాడుతూఉన్నారు. సభా

సదులంతా వీరవేషాలతో దర్పంగా కూర్చున్నారు. కవచాలు ధరించి కావలివారు భయంకర యమభటులవలె తిరుగు తున్నారు. జనశూన్యమైన నదీ ప్రాంతాల్లో తిరుగు సింహాల వలె కవచాలు ధరించి కాపలావారు తిరుగుతున్నారు. సభంతా నిశ్శబ్దంగా ఉంది. జయచంద్రుని హృదయం అశాంతితో, భయంతో వ్యాకులపడుతూ ఉంది. ఇంతలో ఒక వృద్ధచారణుడు భూతకాల స్మృతిచిహ్నంలాగ వచ్చాడు. తెల్లని దుస్తులు, ముడతలుబడ్డ ముఖం, బక్కచిక్కిన శరీరం, చేతిలో కర్ర ఉంది. నడుమున పొడుగైన కత్తి వ్రేలాడుతూ ఉంది. వంగిపోయిన వీపుపై బరువైన కవచం ఉంది గడ్డం పెరిగిఉంది. కరకు మీసాలు మెలిదిరిగి ఉన్నాయి లోనికి పీక్కుపోయిన కండ్లు మెరుస్తున్నాయి. కోరలు, గోళ్ళు లేని ముసలిపులివలె వచ్చిన చారణుని చూచినవెంటనే సభంతా కదలబారింది. పాటలు వీణాదివాద్యాలు ఆగిపోయాయి. జయచంద్రుడు చిరునవ్వు నవ్వుతూ ఆ వృద్ధునితో "తమ రెట్లు దయచేశారు? కుశలమా!" అన్నాడు. చారణుడు నమస్కరిస్తూ "మహారాజా! తమ ప్రతాపం సూర్యునివలె ప్రకాశిస్తూఉంటే అంధకారంవంటి ఆపదలు తమ ప్రజల నేమి చేయగలవు? మేము తమ పాదాశ్రితులము. కృపాపాత్రులం మహారాజా! ఈ దాసుని భార్యకూడ క్షేమంగా ఉంది" అన్నాడు. సభాసదులు—"జై మహారాజుకుజై" అని కేకలు

వేశారు. సభంతా మారుమ్రోగింది. కాని దురదృష్టం వ్యంగ్యంగా నవ్వింది. చారణుడు—"దయానిధీ! ఈ దాసుని క్షమించినట్లైతే హృదయంలోని వ్యాకులత్వాన్ని తమ పాదాల సన్నిధిని విన్నవించుకుంటాను" అన్నాడు జయ చంద్రుడు. "స్వదేశానికి కవులే గౌరవం. నీవెల్లప్పుడు క్షమా పాత్రుడవే చెప్పు" అన్నాడు. సభంతా ఉత్సాహంతో నిండింది. అప్పుడు చారణుడు ఇట్లు చెప్పనారంభించాడు—

"మహారాజా! రాత్రి ఈ దాసుడొక స్వప్నాన్ని చూచాడు. దురదృష్టవంతుని అదృష్టంవలె జనశూన్యమై, ధ్వంసం చేయ బడ్డ ఒక ప్రాంతం ఉంది. ఒక వృద్ధురాలు గాయాలతో భూమిపై దొర్లుతూఉంది. బంగారు కిరీటం దూరంగా ముక్కలు ముక్కలై పడిఉంది. ఒక సింహం బాణాలతో ఛేదింపబడి దొర్లుతూఉంది. మంగళకలశం బద్ధలై పడిఉంది. ఒకవైపు విదియనాటి చంద్రునివలె భయంకరమైన కత్తి ముక్కలు ముక్కలై పడిఉంది. ఆ వృద్ధురాలి కాళ్ళకు, చేతులకు సంకెళ్ళు ఉన్నాయి. ప్రాణంతో ఉన్న ఆమె శరీ రాన్ని గ్రద్ధలు ముక్కులతో పొడుస్తూ ఉన్నాయి. నక్కలు, కుక్కలు ఆమె శరీరాన్ని చుట్టుముట్టి అరుస్తూ చీలుస్తూ ఉన్నాయి. అప్పుడప్పుడు ఆమె బాధతో మూల్గుతూఉంది. ఇంతలో ఒక మహారాక్షసుడు చేతితో కొరడా పట్టుకొని మహాకోపంతో వచ్చాడు. అతడు భయంకర యమదూత

వలె నున్నాడు. దిక్కులన్నీ అగ్నిజ్వాలలతో మండిపోతు న్నాయి. ఆకాసంలో స్త్రీ పురుషుల ఆర్తనాదాలు ప్రతి ధ్వనించాయి. ఆ రాక్షసుడు పండ్లు కొరుకుతూ, గర్జిస్తూ, పరుగెత్తుకొని వచ్చాడు. తన కాళ్ళతో కిరీటాన్ని నేల రాచాడు. అదిచూచి వృద్ధురాలు "ఓరీ! పాపీ! ఈ అవమానాన్ని నేను సహించలేను. నాలో శక్తిలేదు. వీరపుత్రుడైన జయచంద్రుడు నన్ను మోసంచేశాడు. అతడు నాకు సుపుత్రుడే అయిఉంటే త్రికాలాలలో స్వప్నంలో కూడ పొరపాటునైన ఇటువైపు చూడగల సాహసం నీకు కలిగి వుండేదా? దైవగతి వ్యతిరేకించింది" అని జాలిగా చూచింది. మెరుపు మెరిసినట్లు ఆ రాక్షసుడు ఒక్క దూకు దూకి ఆ వృద్ధురాలి హృదయంపై ఒక్కతన్ను తన్నాడు. ఆమె మూల్గుతో ఆకాశం ప్రతిధ్వనించింది. కొంచెం ఆలో చించి ఆ రాక్షసుడు మళ్ళీ వృద్ధురాలిని కొరడాతో కొట్ట నారంభించాడు. ఆదృశ్యం హృదయ విదారకం, మహా క్రూరం, మహారాజా! ఆలోచించండి. ఇక్కడ కూర్చున్న వారంతా ఆలోచించండి. ఆస్వప్నం అబద్ధమో నిజమో" అని చారణుడు ఏడ్చాడు. సభాసదులంతా కంటతడి పెట్టారు. జయచంద్రుడు వ్యాకుల పడ్డాడు. గాయకులు, ఛత్రధరుడు, దాసీలు, దుఃఖింపసాగారు. కాపలావాళ్ళు శస్త్రులు ఒరల్లోపెట్టి ఏడ్చారు. ఈవిధంగా సభంతా దుఃఖంతో నిండిపోయింది.

మళ్ళీ చారణుడు గద్గదస్వరంతో "ఈ విధంగా ఆర్యభూమి పరాధీన అయిపోయింది. ఆర్యఖడ్గ గౌరవం పరాజయ కళం కంలో అణగిపోయింది. ఇటువంటి సమయంలో మనం ఆనం దంతో మత్తెక్కి కూర్చొని ఊగుతున్నాము. మనం ఏముఖం పెట్టుకొని మేము ఆర్యపుత్రులమని ఇది మా దేశమని చెప్పు కొంటాము. ఆత్మగౌరవాన్ని, స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొని బ్రతికేదానికంటే మరణించడం ఎంతో సుఖంగదా" అన్నాడు.

జయచంద్రుడు స్వప్నంలోనుంచి మేల్కొన్నట్లు పెద్ద నిట్టూర్పు విడిచి నిలబడ్డాడు. సభ సమాప్తమైంది. ప్రతి సభి కుడు ప్రళయాగ్ని జ్వాలతో నిండిన హృదయంతో సెలవు తీసుకొన్నాడు. చారణుని ఒక్కొక్క శబ్దం పిడుగులాగ హృదయాన్ని కంపింపజేసి ఆకాశంలో ప్రతిధ్వనించింది.

## 6

సౌభాగ్యవతియైన నిశారాణి ఆనందంతో వెన్నెలఅనే పైట చెరగును సిగ్గుతో సవరించుకొంటూ ఒడిలో చంద్రుని ఆడించుకుంటూ ముద్దుపెట్టుకుంటూ వచ్చింది. కీచురాళ్ళ ధ్వని చెలరేగింది. సరోవరాల్లో కలువపూలు వికసించాయి. సువాసనతో నిండిన వనపుష్పాల కాంతి భూమినుండి ఆకాశం వరకు వ్యాపించింది.

జనశూన్యమై దుఃఖపూర్ణమై శాంతముతో కూడిన ఉద్యానవనంలో జయచంద్రుడు వ్యాకులమనస్సుతో తిరుగుతున్నాడు. ఒకప్పుడు పెద్ద నిట్టూర్పులు విడుస్తున్నాడు. మరొకప్పుడు గుప్పిళ్ళు బిగించి రోషంతో పండ్లు కొరుకుతున్నాడు నావికుడులేని నావవలె జయచంద్రుడు భయంకర భావాలతో వ్యాకులపడుతున్నాడు. అగ్నిపర్వతం బ్రద్దలయ్యే ముందు భూమి కంపించునట్లు ఉద్యానవనంలో జయచంద్రుడు వ్యాకులత్వంతో కంపించిపోతున్నాడు. సుఖస్వప్నంలాగా రాత్రి గడచిపోతూ ఉంది. కావలావారు చేత ఖడ్గం ధరించి కునికిపాట్లు పడుతున్నారు. అంతఃపురంలో పట్టపురాణి కునికిపాటుపడుతూ ఉంది. ఒకమూల దీపం మిణుకు మిణుకుమంటూ అందమైన గాయకురాలు ఒడిలో వీణ పెట్టుకొని సొమ్మసిలి ఊగుతూ ఉంది. వాసన చూడని పుష్పమాలలు వాడిపోయాయి. ఉత్సాహవంతులైన చెలికత్తెలు అలసిపోయి కునుకుతున్నారు, శరీరంపై పూసిన కస్తూరి గంధాలు నేల వెలబోతున్నాయి, కొప్పులు విడిపోయాయి. లోలకులలోని ముత్యాలు మంచుబిందులవలె చల్లబడ్డాయి. నిద్రలేక కళ తప్పిన చంద్రుడు తన రథంయొక్క లేళ్ళ కళ్ళెములను వదులుచేసి తోలుకుంటూ పడమటి దిక్కుకు బయలుదేరాడు. నిరుత్సాహముతో శరీరస్పృహ లేక చింతామగ్నుడై జయచంద్రుడు ఉద్యానవనంలో తిరుగుతున్నాడు. శరీరం శుష్కించింది. కండ్లు మూతలుబడ్డాయి. వెంటనే జయచంద్రుని

కల్పనా నేత్రాలు తెరుచుకొన్నాయి. వృద్ధురాలు, పరాధీనురాలు, దీనురాలు, బంధితురాలైన ఆర్యభూమి కనబడింది ఆమె ప్రతి అవయవమునుండి రక్తము ప్రవహిస్తూ ఉంది. దెబ్బతిన్న సింహం బాధతో ప్రాణాలు కోల్పోతూఉంది. లక్షలకొలది, పిల్లలు బాణాలతో ఛేదింపబడి దొర్లుతున్నారు. మదపు టేనుగు పుష్పాలను నలిపివేసినట్లు వారి అవయవాలు చితుకగొట్టబడ్డాయి అనేకమంది స్త్రీలు, పుత్రులను, భర్తలను, గౌరవాల్ని పోగొట్టుకొని తలలు బాదుకొంటూ ఏడుస్తున్నారు. ఒక స్మశానం కనబడింది. రక్తపు బురదలో లెక్కకు మించిన శవాలు పడిఉన్నాయి. నక్కలు, గ్రద్దలు వాటిని చీల్చిచీల్చి తింటున్నాయి. ఢక్కాలు మ్రోగిస్తూ పిశాచాలు నాట్యం చేస్తున్నాయి చేత త్రిశూలాలు ధరించి ప్రేతాలు నృత్యం చేస్తున్నాయి. దిక్కులు మండుతున్నాయి. గాలి అగ్నిజ్వాలగా మారింది. సస్యశ్యామలమైన భూమి మాడి నల్లబడింది. ఆకాశంలోని మేఘాలు దూదిలాగ ఎగిరి పోతున్నాయి. భయంకర ధ్వనులతో పర్వతాలు మండుతున్నాయి. రాళ్లు బద్దలైనప్పుడు ఆకాశం ప్రతిధ్వనిస్తూఉంది. ఆకాశంలోనుండి కాలిన బూడిద రాలుతూఉంది. ఆ మహానాశనంలో పృథ్వీరాజు కనిపించాడు. చేతి ఖడ్గం ధరించి దూకుతున్నాడు. జోడుగుండ్ల తుపాకినుండి అగ్నిజ్వాల బయలుదేరినట్లు అతని కండ్లనుండి రోషాగ్ని ప్రజ్వరిల్లుతూ ఉంది. పృథ్వీరాజుయొక్క రుద్రమూర్తిని చూడగానే జయ

చంద్రుడు బాటసారి యెదుట భయంకర సింహాం దూకినట్లు కేకపెట్టాడు. వెంటనే కత్తిలాగాడు. కాపలావారు పరుగెత్తు కొని వచ్చారు. జయచంద్రుడు భయంతో గజగజ వణకుతూ చెమటతో తడసిపోయాడు. కాపలావారు చుట్టూచేరారు. జయచంద్రుడు స్పృహ తెచ్చుకొని సిగ్గుపడి అంతఃపురం వైపు వెళ్ళాడు కాపలావారు ఒకరినొకరి చూచుకొంటూ మెల్లమెల్లగా నవ్వుకొంటూ తిరిగి వెళ్ళిపోయారు. దాసీలు భయపడ్డారు. రాణీ వ్యాకులపడింది. అంతఃపురమంతా కలత చెందింది (ఎవరూ) ఒకరితో నొకరు ఒక్క మాటకూడ మాట్లాడడానికి సాహసించలేకపోతున్నారు. అందరు కళ్ళ నిండా నీరు గ్రక్కుకొని గద్గదస్వరంతో భగవంతుని ప్రార్థించసాగారు. జయచంద్రుడు ఇంటిగో చేరి తలుపులు మూసుకొని చింతామగ్నుడై ఆలోచించసాగాడు.

"నేడు మహారాజు పృథ్వీరాజు సమాప్తి చెందాడు. నేర్పుతో నాకు విజయం లభించింది వజ్రంవలె కఠినమైన నా హృదయాన్ని చీల్చుకొని ప్రకాశవంతమైన రూపంతో పరాజయం తొంగిచూస్తుంది. ఆకాశంనుండి భూమివరకూ ఉన్న శూన్యత్వం నేడు అవమానంతో నిండిపోయింది. క్రోధంతో మండుచున్న కోట్లకొలది కండ్లనుండి నే నెట్లు ఈ అధమ శరీరాన్ని దాచగలను? మహా ప్రయత్నంచేసి ద్వేష సముద్రాన్ని మథించి భయంకర హాలాహలాన్ని

బయటకు తీశాను. దాని భయంకర జ్వాలలతో మాతృ భూమి దిక్కులేక మాడిపోతూఉంది. అయ్యో! నేనుఈనీచ మైన నరయజ్ఞానికి పురోహితుడులాగ మొదట తయా రయ్యాను. ఇప్పుడు సమిధగా తయారవుతున్నాను. ఢిల్లీపతి వోడిపోయి గోరీకి బందీ అయినాడు. అంధుడయ్యాడు. కాని ఆ వీరుని పవిత్ర కీర్తి శరీరం స్వేచ్ఛగా, బలంగా, స్థిరంగా, సత్యంగా ఉంది. దానిని కత్తితో ముక్కలుచేయడం అసం భవం. నేడు పృథ్వీరాజు కీర్తి నాకీర్తిగౌరవాలను నాశనం చేస్తూఉంది. అద్దంలో ఒకసారి నారూపాన్నిచూచుకొనే సాహసంకూడ నాకు లేదు. నా మనస్సే నన్ను ధిక్కరిస్తూ ఉంది— "ఇలా జీవించటంకంటె మరణించడమే ఎంతో సుఖకరం" అని చారణుడు సత్యాన్నే చెప్పాడు అని జయ చంద్రుడు చేతులు జోడించి కన్నీటితో—"భారతమాతా! ఈ తుచ్ఛుని క్షమించు, నా రక్తంతో నా శరీర కళంకాన్ని కడిగివేస్తాను. నేటివరకు నేను పాపసముద్రంలోఈ శరీరనావను నడిపాను. ఇప్పుడు దీనిని కత్తిపదునుపై నడుపుతాను. మహే శ్వరి పాదపద్మాలవద్ద ఇదే నా విన్నపం. తల్లీ! నాకు సాహసాన్ని, ధైర్యాన్ని, పరాక్రమాన్ని, బలాన్ని, ఆత్మగౌరవాన్ని, ఉజ్జ్వలమైన ప్రకాశాన్ని ఇయ్యవమ్మా" అని ప్రార్థించాడు.

పడమర దిక్కున నిశారాణి సెలవుతీసుకొని వెళ్ళి పోయింది. తూర్పుదిక్కున యుద్ధభూమివలె ఎర్రదనం వ్యాపిం

చింది. సౌభాగ్యవతి అయిన ఉషాసుందరి నెమ్మదిగా వచ్చింది. కలవలు ముడుచుకొన్నాయి. తామరలు నవ్వా సాగాయి. ఒకరి దుఃఖం మరొకరికి సుఖం. ఇదే విధివిలాసం యొక్క నిర్ణయానికి ప్రమాణం.

## 7

వివాహానికి ముందు పెండ్లికూతురు అలంకరింపబడినట్లు చిర సౌభాగ్యవతి అయిన ఢిల్లీ అలంకరింపబడింది. కాని వరుడు మార్గంలోనే రాక్షసులచేత చంపబడ్డాడని, అతని వెంటనున్న పెండ్లివారంతా యమలోకానికి వెళ్ళారని ఆమె ఎరుగదు. వారిలోనుండి ఒకడు బ్రతికి బయటబడి మహాబాధ ననుభవిస్తూ భగ్న విషయాన్ని తెలియజేయడానికి వస్తు న్నాడు. అర్ధరాత్రి అయిపోతూ ఉన్నప్పటికీ మహానగరం మేల్కొనే ఉంది. రాజమార్గం ఉజ్వలకాంతితో ప్రకాశిస్తూ, నవ్వుతూ ఉంది. అందమైన నగరవీధులన్నీ జనంతో నిండి ఉన్నాయి. ఇంటింటా దీపాలు వెలుగుతున్నాయి. ప్రతి గుమ్మందగ్గరా మంగళకలశాలు శోభిస్తూన్నాయి. ప్రతి ద్వారానికీ మామిడాకుల తోరణాలు కట్టబడ్డాయి. ఈ విధంగా ఢిల్లీ ఆనందంతో నిండిఉంది. మహారాజు అనార్యులను తరిమివేసి గోరీని బంధించి విజయలక్ష్మితో ఎప్పుడు వస్తారా

అని వారి స్వాగతంకోసం స్త్రీ పురుషులంతా ఉత్సాహంతో ఉన్నారు. అర్ధరాత్రి కావచ్చింది. ఆకాశంలో నక్షత్రాలు మేల్కొని ప్రకాశిస్తూ ఉన్నాయి. నీలసరోవరం మధ్య ఈదుతున్న హంసవలె చంద్రుడు నవ్వుతున్నాడు. బాల హంసవలె నక్షత్రాలు విరజిమ్మబడి వున్నాయి. రాత్రంతా తన పాపాన్ని తలపోసుకొంటూ, దేవుని ప్రార్థిస్తూ, ఒక మూఢు విటుని కొరకు ఎదురుచూచే వేశ్యవలె ఆర్యావర్త రాజధాని ఢిల్లీ మేల్కొని ఉంది. క్రమక్రమంగా రాజమార్గం శూన్యమైపోయింది. వీధులు చీకటిని కౌగిలించుకొని నిద్రించాయి. దీపాలు పెద్ద నిట్టూర్పు విడిచి ఒక్కొక్కటే ఆరిపోయాయి. ఆరిపోయిన దీపాలచుట్టూ మిడతలు వ్యాకులత్వంతో నిరాశచెంది కూర్చున్నాయి. మాడిన మిడతలు బాధతో మూల్గుతూ "భగవంతుడా! దీపానికి కాంతినివ్వ మేము దానిలో భస్మమై కోర్కెలను పూర్తిచేసుకొంటాము" అంటున్నాయి. సుఖభోగాలలో నున్నవారిని మృత్యువు దుఃఖపెడుతుంది. కాని ఆపదలలో నున్న వారికి ఆనందమయంగా తయారవుతుంది. జీవన్మరణాలకెల్లప్పుడూ భయంకరమైన పోటీ జరుగుతూనే ఉంటుంది. జీవనమూల్యం తగ్గినప్పుడు మరణమూల్యం పెరుగుతుంది. ఇది సనాతన సత్యం.

పవిత్రమైన కవి హృదయంవలె రాజమార్గానికి దూరంగా ప్రజలదృష్టిలో బడకుండా ఉద్యానవనం మధ్యలో

ఒక భవనం శోభిస్తూ ఉంది. భవనంలోపల ఒక అందమైన గది ఉంది. అగర ఒత్తుల పొగతో ఆ గదిలోని గాలి ఆనందాన్ని కలిగిస్తోంది. అక్కడక్కడ పూలమాలలు వ్రేలాడుతున్నాయి. పువ్వులు మకరందంతో నిండి సువాసనతో కూడి పళ్ళెములలో నిండి ఉన్నాయి. పెద్ద పెద్ద దీపాలు మృదువైన కాంతిని అన్ని వైపుల విరజిమ్ముతున్నాయి. అందమైన లేడిచర్మం పరచిఉంది. ఒక గ్రంథం దానిపై శోభిస్తూవుంది. గ్రంథంమీద పువ్వులు, పూలమాలలు పెట్టబడి ఉన్నాయి. గ్రంథాని కెదురుగ ఒకఖడ్గం పెట్టబడిఉంది. అది గంధంచేత, పుష్పాలచేత భక్తితో పూజింపబడి ఉంది. దూరంగా ఒక యువకుడు భోజపత్రాలను, సిరాబుడ్డిని, కలాన్ని, ఎదుట బెట్టుకొని కూర్చున్నాడు. అతడు ధ్యానంలో నిమగ్నమైనప్పటికి శాంతమైన ముఖంలో ఆలోచనా సముద్రపు అలలు లేస్తున్నాయి. అట్టి సమయంలో చందకవి నిరాశతో లోన ప్రవేశించాడు. అతని వెంట వ్యాకులత్వంతో, ఘోరమైన దుఃఖంతో, ధైర్యంచెడి మూర్తీభవించిన కవిత్వ ప్రతిబింబమో యన్నట్లు కవిపత్ని ఉంది. ఆమె – "కృపానిధీ ! తమరీ తుచ్ఛదాసిని వదలి కులటయైన కృపాణాన్ని ఎందుకు ప్రేమించారు. అది అందరినీ మోసగించి ప్రవాహ మధ్యంలో ముంచుతుంది. ఆ రాక్షసి ఎల్లప్పుడు తన ప్రియుని రక్తాన్ని, తన ఆశ్రితుల రక్తాన్ని మంచిరుచిగా నాకుతూ ఉంటుంది" అని అంది. చందకవి సగం

వృద్ధునివలె కనబడుతున్నాడు. కనుబొమలు చిట్లించాడు ముఖాభావం భయంగొల్పుతూ ఉంది. చెట్ల తోట్లలో ప్రజ్వ రిల్లు అగ్నిజ్వాలలవలె కండ్లులోనికి పీక్కుపోయి తొంగిచూస్తు న్నాయి. కవిత్వాన్ని కల్పనలు వెంబడించినట్లు కవిపత్ని కవిరాజువెంట నిశ్శబ్దంగా వచ్చింది. దెబ్బతిన్న సింహాం గర్జిస్తూ పండ్లు కొరుకుతూ తన గుహాలోనికి తిరిగి వచ్చినట్లు చందకవి వ్యాకుల హృదయంతో వచ్చాడు. యువకుడు లేచి భక్తితో నమస్కరించాడు. కవీంద్రుడు పెద్దనిట్టూర్పు విడిచి నెమ్మదిగ కూర్చున్నాడు. కవిపత్ని - "నాథా! యుద్ధం నుండి యెప్పుడు వచ్చారు? మీ శరీరం బాగా గాయపడింది. యుద్ధ ఫలితాలను వినవలెనని ఉంది చెప్పండి. యుద్ధభూమి నుండి మీరెట్లు వచ్చారు. ఆర్యపతి పృథ్వీరాజు క్షేమముగా నున్నారా? ఆర్యసేన సింహానాదాలు, ఆర్యభూమి జయధ్వా నాలు వినబడడంలేదు, క్షమించాలి. నా మనస్సుకు అనుమా నంగాఉంది. నా హృదయం వ్యాకులంగా ఉంది చెప్పండి" అని అన్నది. చందకవి గద్గదస్వరంతో - "దేవీ! నేడు మన మాతృభూమి బంధింపబడింది. ఈఢిల్లీ సౌభాగ్యం మరల అంతరించింది. నేడు ఆర్యశక్తి దుమ్ములో గలిసిపోయింది. యుద్ధభూమిలో అకస్మాత్తుగా సూర్యు డస్తమించాడు. స్వదేశ గౌరవమంతా దోపిడీ చేయబడింది. ఏమిచెప్పను? ఎట్లు చెప్పను? నోరాడటంలేదు. ఆర్యపతి పృథ్వీరాజు అదృ

శ్యమైనాడు" అని నిట్టూర్చి నిశ్శబ్దంగా కూర్చున్నాడు. కవి పత్నికూడ మౌనంగా కాలి వ్రేలితో నేల రాస్తూఉంది. దీపం హృదయ జ్వాలతో మౌనంగా వెలుగుతుంది. వసంతపవనం మౌనంగా వీచింది. చంద్రుడు ఆకాశం మౌనంగా ఉన్నాయి. భూమి, దిక్కులు మౌనం వహించాయి. అంతా నిశ్శబ్దం చందకవి "దేవీ ! చూచావా ! స్వర్గం రౌరవ నరకంగా మారిపోతూఉంది. ఆర్యభూమి సుపుత్రులైన వీరులనేకమంది యుద్ధప్రవాహంలో మునిగికొట్టుకొనిపోయారు. నేనొక్కడను మాత్రం మృత్యు ముఖంనుండి పరాజయ భారంతో బ్రతికి బయటబడ్డాను. బహుశః పాపభూయిష్టమైన నాశరీరాన్ని ముట్టుకోడానికి మృత్యుదేవతకు అసహ్యం కలిగియుండవచ్చు నేడు రాజధాని అలంకరించుకొని ఆర్యవీరులకు హారతు లివ్వడానికి, స్థిర విజయుడైన పృథ్వీరాజును పూజించడానికి సిద్ధంగాఉంది." అని మరల "ఓ రాజ్యలక్ష్మీ! హారతి విసరి పారవేసి కత్తి తీసుకొని చండికవలె ముందుకు సాగు. భువన మోహనమైన స్వరూపాన్ని వదిలిపెట్టు. హస్త కంకణాలు, కాళ్ళగజ్జలు, విసరి పారవెయ్యి. పయట చెరగుతో నడుం బిగించి లేళ్ళ గుంపులో ఆకలిగొన్న సింహంవలె దూకు." అని కొంతసేపు కల్పనా ప్రపంచంలో విహరించి చందకవి — "అదృష్టదేవత, రణచండిక కోపగించింది. ఈ భంగవంతునికి రాజ్యలక్ష్మికి కోపంవచ్చినది. చూస్తూచూస్తూ ఉండగా

దేశం నశించిపోయింది దేవీ! నేడు నా హృదయం బ్రద్దల వుతూ ఉంది. ఇప్పుడేమి చేయాలో నాకర్థం కావడంలేదు" అన్నాడు. వెంటనే కవిపత్ని - "ఆర్యా! నీవంటి ధీరులు ఇంత నిరాశ చెందడం తగదు. వీరుడు స్వయంగా తన అదృష్టాన్ని నిర్మించుకొంటాడు. బ్రహ్మదేవుడు కూడ కర్మవీరుణ్ణి "నీ అదృష్టంలో ఏమి వ్రాయమంటావో చెప్పు" అని అడుగు తాడు. మీరు కర్మవీరులని ఆర్యభూమి చెప్పుతూ ఉంది. అనేకమంది నోరులేనివారిని ఉత్సాహ పరచి భాషాదాన మిచ్చి సంతృప్తి పరచారు. ఈ ఆర్యజాతిని మీరే నిర్మాణం చేశారు. మీరు మీ అదృష్టానికి స్వయంగా సృష్టికర్తలు పిరికివారికి బ్రహ్మదేవు డొకసారి అదృష్టాన్ని వ్రాస్తాడు. కాని బలవంతులకెల్లప్పుడు సహాయం చేస్తూ ఉంటాడు. నాధా! భగవంతుడు పూజలకు, వ్రతాలకు, ఉపవాసాలకు, పాటలకు సంతోషించడని కర్మవీరుని గర్జనకు సంతోషిస్తాడని తమ రొకప్పుడు నాకు చెప్పారు. సాహసమే జీవనం. నిరాశయే మృత్యువు." అన్న మాటలు విని కవీంద్రుని భుజా లుప్పొం గాయి. నరనరంలో రక్తం పరుగెత్తింది. హృదయ ముప్పొం గింది. కండ్లెఱ్ఱబడ్డాయి. రోషంతో - "ఆర్యపుత్రీ? నేను నిరాశ చెందను. చివరివరకు పోరాడి ఆర్యధర్మాన్ని పాలి స్తాను. కాని ఒకమాట నేనువ్రాసే మహాకావ్యంలో మిగిలిన సర్గ లెవరువ్రాసి పూర్తిచేస్తారనే చింత నన్ను పీడిస్తూఉంది"

అన్నాడు. అప్పుడక్కడ నున్న యువకుడు నమస్కరించి నెమ్మదిగ - "దేవా! తమ యాజ్ఞ అయితే నేను వ్రాస్తాను. ఈ పూజ్య మహాకావ్యాన్ని పూర్తిచేస్తాను" అన్నాడు. చందకవి ప్రేమపూరిత గద్గద కంఠంతో "కుమారా! జల్హ! హృదయభారం తొలగిపోయింది. చింత నశించిపోయింది. నీవు చేత కలాన్ని ధరించు, నేను ఖడ్గాన్ని ధరిస్తాను. భారతీదేవికి నేడు నా కడపటి వీడ్కోలు" అన్నాడు. అంతట కుమారుడు తల్లి పాదాలకు నమస్కరించి తండ్రి పాదధూళిని శిరస్సున ధరించాడు. కవీంద్రుడు ఆనంద బాష్పాలతో చేతులెత్తి విశ్వ భారతిని సంబోధించి - "తల్లీ! నేడు నీ పాదసేవనుండి విరమించుకొంటున్నాను. నామాతృభూమిలో అగ్ని ప్రజ్వరిల్లుతూ ఉంది. దేశం పరాధీన మైనప్పుడు ప్రేమగీతాలను వ్రాసే కవులకు అవమానమే శరణ్యం. తల్లీ భారతీ! పూర్వం ఏ విధంగా నీవు నా వ్యూహచ్ఛాయలో గొప్పగొప్ప గీతాలను సృష్టించావో అట్లే నేడుకూడ నా వ్యూహాలపై అమృత వర్షాన్ని కురిపించు. ఇప్పుడు మహామృత్యు హృదయాన్ని చీల్చి ప్రవేశింపబోతున్నాను. కుమారా! జల్హ! నేను మహా నాశనంతో ఆడుకొనబోతున్నాను. నీవు భారతీదేవి ఒడిలో ఆడుకో" అని చందకవి మౌనం వహించాడు. కవీంద్రుని ఒక్కొక్క శబ్దంలో వీర, శాంత రసాలు నాట్యంచేస్తూ ఉట్టి పడుతున్నాయి. ప్రవహించాయి. అప్పుడు కవిపత్ని "ఆర్యా!

ఇక మీరు విశ్రాంతి తీసుకోండి. నేను ఈ సమాచారాన్ని మహారాణికి తెలియజేస్తాను. ఆమె భవానీ మందిరంలో నుండ వచ్చు. అయ్యో! ఆమె వరానికి బదులుగా శాపాన్ని పొందవంది. అయినదేదో అయిపోయింది. యుద్ధక్షేత్రంలోనికి మహారాజు, చండికా మందిరానికి మహారాణీ ఒకేసారి వెళ్ళారు. ఇంతవరకు తిరిగి రాలేదు. రాత్రింబగళ్ళు దేవీ సేవలోని మగ్నమైంది. చివరికంతా వ్యర్థమైపోయింది. భవానీ గోరికే సహాయ పడింది. దైవలీల అగమ్యగోచరంగదా!

పైన నీలాకాశం, క్రింద నీలప్రవాహంతో యమున, మధ్య ఉషాదేవి ఎర్రని కాంతితో ప్రకాశిస్తూ ఉంది. వ్యాకులత్వంతో ఏడుస్తూ నిశాదేవి నిశ్శబ్దంగా సెలవు తీసుకొంది.

# 8

పాలరాతితో కట్టబడిన మహాకాళికామందిరం బంగారు ప్రమిదలలో దీపాలు వెలుగుతున్నాయి. నాల్గువైపుల నందన వనంవంటి ఉద్యానవనం కోయిలలు పాడుతూ ఉన్నాయి. నెమళ్ళు ఆడుతున్నాయి. నిర్మల సరోవరంలో హంసలు ఈదుతున్నాయి. అంతటా శాంతం వ్యాపించింది. ఒక మనోహరమైన పల్లకీ వచ్చింది. దానిలోనుండి నల్లని వస్త్రాన్ని ధరించిన కవిపత్ని నిశ్శబ్దంగా నీడవలె దిగింది. నెమ్మదిగ

రాజహంస నడకతో, కోమలమైన ఎర్రని పాదాలతో మంది రంలో ప్రవేశించింది. కాని కాళ్ళు ముందుకు సాగటంలేదు. తొట్రుపడుతున్నాయి. పాలరాతి మెట్లను దాటి ధ్యానంలో నిమగ్నమైయున్న మహారాణియొద్దకు చేరింది. ఎత్తైన వేదికపై మహాకాళి ప్రతిమ ఉన్నది ఆ ప్రతిమ తలపై రత్నకిరీటము ప్రకాశిస్తూ ఉంది. శరీరంపై అనేక రత్నాభరణాలు శోభిస్తు న్నాయి. ఎదుట మాంగళికకలశం నీటితో నిండిఉంది. ప్రమిద లలో దీపాలు వెలుగుతున్నాయి. మహారాణి ధ్యానమగ్నమై ఒంటరిగ కూర్చొనిఉంది ఆమె పసుపుపచ్చని పట్టుచీర ధరించింది. జయంకొరకు సర్వసుఖాలను వదలి హెగతో కూడిన అగ్నిజ్వాలవలె కనిపిస్తూఉంది. కవిపత్ని భయపడుతూ నెమ్మదిగా వచ్చి మహామాయకు నమస్కరించి కూర్చుంది. కొంతసేపటికి మహారాణి పద్మమువంటి తన కన్నులను తెరచి దోసిలితో పుష్పాలనుతీసి భక్తితో జగదంబ పాదా లపై సమర్పించింది. కవిపత్ని లేచి అమృతవాక్కులతో "స్వస్తి" అని మహారాణి ఉలికిపడింది. కవిరాణి ప్రేమతో— "దేవీ! తమ రీ పూజనాపండి. తమతో నొక విషయం విన్న వించాలి" అని అంది. మహారాణి చిరునవ్వు నవ్వి పూజ నాపి—"అమ్మా! తమకు కుశలమా" అన్నది. కవిపత్ని నిట్టూర్చి—"దేవీ! కుశలమే. తమరు స్థిమితంగా నుండండి. యుద్ధ వృత్తాంతాన్ని వినిపిస్తాను. ఆర్యజాతి అదృష్టం అంత

రించిన యుద్ధవృత్తాంతాన్ని వినిపిస్తాను" అన్నది. మహారాణి చలించి ఒకక్షణమాగి మనస్సును దృఢంచేసుకొని "అమ్మా! నేను ఆర్యపతి వీరపత్నిని. ఆర్యదేశానికి పట్టమహిషిని. నా శరీరం రక్తమాంసాలతో కూడినదైనా పిడుగుపాటునుగూడ నవ్వుతూ సహించగలను. నన్ను తమరెరుగరా!" అన్నది.

"ధన్యురాలను. భారతేశ్వరీ! మన ఆర్యభూమి ఎన్నటికి కళంకితురాలు కాజాలదనియే నా ఆశకూడాను. తమవంటి వీరవనిత జీవించినంతవరకు ఆర్యావర్తము, ఆర్యజాతి, ఆర్య ధర్మము, రక్షింపబడుతూనే ఉంటాయి. వినండి యుద్ధం పూర్తియైపోయింది. ఆర్యసేన గతించింది. ఆర్యజాతి పౌరుష మంతరించింది. ఆర్యజాతి గౌరవమదృశ్యమైంది. చిరకాలం నుండి ఆర్జించిన ఆర్యభూమి సుకీర్తి మంచుగడ్డలా కరిగిపోయింది. ఈ మహానాశనంలో ఆర్యపతి అంతర్ధానమయ్యారు. అనార్యులు విజయాన్ని పొందారు. ఆర్యుల విజయ భాస్కరు డస్తమించాడు. ఆ యుద్ధంనుండి కవిభగ్నదూతనై వచ్చారు. వారు తమకు ఈ దుఃఖవార్త విన్నవించుటకు నన్ను పంపించారు." అని మౌనం వహించింది. మహారాణి మౌనం వహించింది. చండికామూర్తి మౌనం వహించింది. దీపాలు కూడ మౌనంగా వెలుగుతున్నాయి. మహారాణి—"దేవీ! పరాశక్తి నీవు కష్టసమయంలో తోడు వీడిపోయావా? అమ్మా! (నా దురదృష్ట గర్జన విని భయంతో గర్జించి

పోయూవా!) నేను ఆపదలకు భయపడుదానను కాను. నాకు శక్తినిమ్ము. ఆపదలను కాలరాచి రూపుమాపి వేస్తాను. నేనే సహాయం అపేక్షించను. కేవలం సాహసాన్నియ్యి. నేడు భర్తలేనిదాననయ్యాను. దీనినిగురించి నాకు చింతలేదు. నా ఆర్యపుత్రుడు కీర్తి శరీరంతో అమరుడయ్యాడు. నేను అక్షయ సౌభాగ్యాన్ని పొందగలిగాను. పిరికివారికి అడుగడుగనా మృత్యువేగాని, వీరులను జూచి మృత్యువుగూడ భయపడుతుంది. కాని యుద్ధంలో సౌభాగ్యం కోల్పోయిన అబలలనుగురించి ఆలోచిస్తే హృదయం బ్రద్దలగుతూ ఉంది. నేడు ఆర్య భూమాత సంకెళ్ళు ఏ విధంగా తెగిపోతాయి? ఆర్యభూమి కీర్తి ఏ విధంగా నిలబడుతుంది?" అని కొంచెం చింతించి తిరిగి రోషంతో—"కవిపత్నీ! తమరు వెళ్ళి కవీంద్రునితో చెప్పండి వారు ఏనోటితో భారతీదేవిని ప్రేమగీతాలతో అర్చిస్తూ ఉండేవారో, కావ్యరూపంలో అమృతాన్ని వర్షిస్తూ ఉండేవారో నేడు ఆ నోటిలోనే అగ్నిజ్వాలను ప్రజ్వరిల్లజేసి ఆర్యజాతిని, స్వదేశాన్ని రక్షించడానికి ఉపయోగించమని చెప్పండి. బహిరంగ యుద్ధంలో శత్రువుల కత్తికి ఏమాత్రం పదును గలదో స్వయంగా చూస్తాను." అని మహారాణి కోపంతో సింహంవలె పండ్లుకొరికి ఒకసారి చండికామూర్తిని చూచింది. విగ్రహం కంపించింది. దీపాలు నెమ్మది నెమ్మదిగా ఆరిపోయాయి. మంగళకలశం పగిలిపోయింది. సూర్యుని

కాంతి క్షీణించింది. దిక్కులు స్తంభించాయి. భూమి కంపించింది. పామువలె బుసగొడుతూ వేడిగాలి వీచింది. అకస్మాత్తుగా అక్కడ ఋతుపరివర్తన జరిగింది అగ్నిగుండంలో నేయిపోసినప్పుడు మహావేగంగా లేచు అగ్నిజ్వాలవలె మహారాశి లేచింది. కాని తల తిరిగింది. క్రిందపడిపోయింది. కవి పత్ని ఆమెను ఒడిలోనికి తీసుకొని విచారంతో కూర్చుని పోయింది.

గోరీతో యుద్ధంలో ఆర్యసేన ఓడిపోయింది. ఆర్యపతి పృథ్వీరాజు వీరగతి పొందాడనే వార్త అరణ్యంలో దావాగ్నిలాగా వెంటనే ఢిల్లీ అంతా వ్యాపించింది. చూస్తూ చూస్తూ నుండగానే ఉత్సాహమంతా అడుగంటింది నిట్టూర్పుల ఊపులకు దీపాలారిపోయాయి. క్షణంలో నిరాశాంధకారం వ్యాపించింది. ప్రజలంతా వ్యాకులత్వంతో కింకర్తవ్య విమూఢులయ్యారు. రాజమార్గంలోను, వీధుల్లోను, విచారంతో, వ్యాకులంతో, ప్రజలంతా తిరుగసాగారు. దేశ స్వాతంత్ర మే విధంగా రక్షింపబడుతుంది అనే ప్రశ్న అందరి హృదయాలను వ్యాకులపరుస్తూ ఉంది. ఇంటింటా అనేక భయంకర గాలివార్తలు బయలుదేరాయి. నగరమంతా గగ్గోలుబడి వికలత్వం చెందింది. కొందరు పాంచాల దేశంలో విప్లవం రేగిందని, కొందరు వంగదేశంలో తిరుగుబాటు జరిగిందనీ, కొందరు గోరీ దోపిడీ చేసుకొంటూ వస్తున్నాడని

అనుకొంటున్నారు. నగరంలో ప్రతి యిల్లూ దుఃఖంతో నిరాశతో నిండిపోయింది. రక్షకభటులు అతి జాగరూకులై భయంతో కాపలా కాస్తున్నారు. వారి హృదయాల్లోనుండి ధైర్యం ఎగిరిపోయింది. పరాజయమనే భావం గట్టిగా నాటుకు పోయింది. ఈ విధంగా ఆర్యులు తమచేతులతో పేర్చిన చితికి తామే నిప్పంటించుకొన్నారు.

చందకవి వ్యాకులత్వంతో నగరమంతా తిరుగు తున్నాడు. తన యుత్తేజిత వాక్కులతో అగ్నిని ప్రజ్వరిల్ల చేస్తున్నాడు. కాని ప్రయత్నమంతా వ్యర్థమైపోయింది. మంచుగడ్డకు వేడెక్కటం అసంభవం గదా! దిరిసనపూలు నిప్పులా ఎర్రగ వుంటాయి కాని వేడి ఎక్కడనుండి వస్తుంది. ప్రజలంతా కవి వాక్కులను జాగ్రత్తగా నిశ్శబ్దంగా విని పెద్ద నిట్టూర్పు విడిచి వెళ్ళిపోతున్నారు. చందకవి శవాలలో ప్రాణాలు పొయ్యాలని చూస్తున్నాడు కాని భగీరథ ప్రయ త్నంలో అతనికి విఫలత్వమే ప్రాప్తిస్తూ ఉంది. ఈవిధంగా పూర్వ గౌరవాన్ని పోగొట్టుకొని ఆర్యులు నిర్జీవులయ్యారు. కాంతిని వెంటనంటి చీకటి వచ్చినట్లు బానిసత్వంతోపాటు చెడుబుద్ధి వస్తుంది. భయంకర తుఫాను వచ్చి ఆగిపోయి నప్పుడు విరిగిన చెట్లు, పాడుబడిన గ్రామాలు దానికి గుర్తు లుగా వుంటాయి. అదేవిధంగా దేశంనాశనమై వోడిపోయిన బాధతో మూల్గుతున్నప్పుడు మానవత్వం సిడవలె దాక్కుం

టుంది. అట్టి పతనం చెందిన దేశవాసులు కౌరవ నరకంవలె దుఃఖంతో తమ రోజులు గడుపుకొంటారు. చందకవి దేశాన్ని పూర్వస్థితికి తీసుకొని రావాలని, శత్రువుల పగ తీర్చుకోవాలనిఆలోచిస్తున్నాడు. కాని కవి స్థితిముండ్లకంపలో చిక్కుకొంటూ ముందుకు సాగే బాటసారివలె జాలిని గలిగిస్తూ ఉంది.

## 9

అర్ధరాత్రి అవబోతూఉంది. ప్రపంచమంతా నిద్రలో నిమగ్నమయింది. మహారాణి భారతేశ్వరి ఆలోచనా మందిరంలో మూర్తీభవించిన శౌర్యంవలె ప్రవేశించింది. పర్వత శిఖరంపై ప్రకాశించు సూర్యకిరణాలవలె ఆమెతలపై రత్న ఖచిత కిరీటం శోభిస్తూఉంది. శరత్ కాల వెన్నెలవలె ఆమె శరీరంపై తెల్లనివస్త్రం శోభిస్తూఉంది. ఆమె వెంట కోమలమైన ఎర్రని హస్తాలలో కత్తులు ధరించి చెలికత్తెలున్నారు. కర్తవ్యమనే ఇనుప తలుపులమధ్య హృదయంలోని సుకుమారత్వం బంధింపబడినదో యన్నట్లు ఉన్నతె కుచాలు కవచంతో బంధింపబడ్డాయి. తాబేలు వీపుపై సర్పం దొర్లుతున్నట్లు ఆమె వీపుపైనున్న ఢాలుమీాద జడ ఊగులాడుతూ ఉంది.

సన్నని నడుముపై కటిబంధం, దానికి రత్న ఖచితమైన కత్తి, వర, శోభిస్తున్నాయి. ముఖం ఎర్రతామర పూవువలె ఎర్రగా ప్రకాశిస్తూ ఉంది. తలపై అందమైన బంగారు శిరస్త్రాణం సూర్యకిరణ సమూహంవలె కండ్లను మిరుమిట్లు గొలుపుతూ ఉంది. మంత్రులు మూర్తీభవించిన ధీరత్వంవలె విరాజిల్లు తున్నారు. చందకవి ఘోరచింతలో మగ్నమై కూర్చొని ఉన్నారు. నిర్జన వనప్రాంతంలో వేటజంతువులకై పొంచి తిరుగు పులులవలె భటులు శస్త్రాలు ధరించి ద్వారాలవద్ద జాగరూకతతో కాపలా కాస్తున్నారు. గాలికూడ భయంతో వణకుతూ వస్తోంది. నిద్ర దూరంగానే తొంగిచూచి పారిపో తూంది. మహారాణి శాంతంగా కూర్చొని - "ఈ యుద్ధ మైతే పూర్తిఅయిందికాని మనం నిర్ణయం చేసిన యుద్ధం మాత్రం ఇంకా మిగిలేఉంది. ఆర్యపతి పృధ్వీరాజు గతిం చారు. అందుకు చింతలేదు. నేను మహారాజు పాదుకలు తీసు కొని సహగమనం చేసేదాననే కాని కర్తవ్యం నన్ను ఆపు తూంది. ఏమిచేయగలను? ఇట్టి కష్టసమయంలో దేశాన్ని వదలి వెళ్ళడం తగిన పనికాదు. గొప్ప అధర్మ మవుతుంది. నేడు దేశమాత వక్షస్థలంమీద అనార్యుడు కూర్చొని ఉన్నాడు. కాళ్ళు పట్టుకొని బ్రతిమాలినా అతడు తొలగి పోయేవాడు కాడు. కాబట్టి మనం త్యాగంతో నశించిపోవటా నికే నిర్ణయించాలి. త్యాగంతోగాని స్వాతంత్ర్యం దొరకదు.

రాజు లెందరుమారినా రాజ్యం మారదు. ఇది నగ్నసత్యం. ఈ ఆర్యభూమిలో అనేకమంది మహారాజులు గతించారు. కాని ఆర్యభూమి, ఆర్యజాతి అమరజీవులై యున్నారు. కాని యిది దేశానికొక సంకటస్థితి. అనార్యుల చేతుల్లో ఆర్యత్వం దెబ్బతిన్నది. ఈ భూమిపై ఆర్యులైన వారెవరైన పరిపాలన చేయవచ్చు. ఇదే నా విన్నపము. నేడు యవనుడు ఆర్య భూమిని కాలరాచి నాశనంచేస్తూ ముందుకు సాగడం చూస్తున్నాం. అధర్మం ధర్మాన్ని అణచివేస్తూ ఉంది తమ రిప్పుడేధర్మాన్ని నిర్ణయం చేసినా అదినాకు సమ్మతమే. నేను ఈ దేశానికొక సేవకురాలను, దేశకృప కెదురు చూచే దానను. ఇదే నా యభిప్రాయం. తమరంతా ఆలోచించండి." అన్నది. అప్పుడు మహామంత్రి భయంకర వీరగర్జనతో "తమరు సమస్త ఆర్యదేశానికి అధీశ్వరియై యున్నారు. తమరు శక్తిస్వరూపిణులు తమ యాజ్ఞ మా కంగీకారమే. నేను మేము సంపూర్ణ రాజభక్తితో ఖడ్గాలపై చేయి వేసి ప్రతిజ్ఞ చేస్తున్నాము" అన్నారు. మంత్రులందరు వరలనుండి కత్తులుదూసి ఉద్రేకంతో - "మహారాణి భారతేశ్వరికీ జై" అని జయధ్వానాలు చేశారు. కోటంతా ప్రతిధ్వనించింది. దుర్గాదేవికూడ జయఘోషతో దిక్కులన్నిటినీ ఊపివేసింది. ఆ ధ్వనినివిని నగరమంతా మెరుపు మెరిసినట్లైంది. దుఃఖమనే అంధకారం పటాపంచలయిపోయింది. ఢిల్లీ గాఢనిద్రనుండి

మేల్కొంది. లక్షలకొలది కంఠాలనుండి భయంకర మేఘగర్జనలవలె, ప్రళయకాల తుఫానువలె జయఘోష బయలుదేరింది. చూస్తూచూస్తూ ఉండగానే సమస్త ఆర్యభూమిలోని అణువణువు జయజయ ధ్వానాలతో ప్రతిధ్వనించింది. జయచంద్రుడు స్వప్నంలో జయఘోష విని ఉలిక్కిపడిపోయాడు. దరిద్ర దేవత బెదరింపులుగా భావించి ఒణికిపోయాడు. భయంతో లేచి భగవంతుని ప్రార్థింపసాగాడు. ఆ జయఘోషను మేఘధ్వనిగా భావించి నెమళ్ళు కూయసాగాయి. ఏనుగులు సింహగర్జనగా భావించాయి. పర్వతాలు వజ్రాయుధ ధ్వనియనుకున్నాయి. దేశం శాంతిని పొందింది. నాశనం చెందిన ఆర్యజాతికి తిరిగి పౌరుషం వచ్చింది. ఆర్యవీరుల కండ్లలో ఎఱ్ఱదనం వ్యాపించింది. ఆర్యఖడ్గాలు పదును దేలి ప్రకాశించాయి. చల్లబడిన రక్తం తిరిగి ఉడుకెత్తింది. ఆర్యపుత్రుల భుజాలలో వీరత్వం ప్రవేశించింది. ఆ సమయంలో భారతేశ్వరి – "మీ అందరికీ ధన్యవాదాలు. మీరు అప్పగించిన ఈ రాజ్యాన్ని ప్రాణాలర్పించి అయినా రక్షిస్తాను. ఆర్యనీతి ప్రకారం రాజు నిమిత్తమాత్రుడే. ఏ రాజ్యానికైనా ప్రజలే శాసనులు. జయచంద్రునకు మనమొక ఉత్తరం వ్రాసి హెచ్చరిక చేద్దాము. శత్రువులకంటె దేశద్రోహిని నాశనం చేయడమే మన ప్రధమ ఆశయం. సంధిప్రశ్న అసలు లేనేలేదు. దేశద్రోహులతో సంధి ఆత్మహత్యతో సమానం. దేశద్రోహు

లతో సంధి చేసుకొని కూర్చోవడం ఇంటికి నిప్పంటించి ఇంట్లో నిద్రబోవడం వంటిది. గడచిన ఆపదకంటె రాబోవు నాపద భయం గలిగించి శక్తి నుడికించి అనర్థాన్ని గలిగి స్తుంది. గోరీ విదేశస్థుడు. అతడు దోపిడీ చేసుకొని పారి పోతాడు. కాని యితడింటిలో దాగిన సర్పం వంటివాడు. అడవిలో దిరుగు పులికంటె అపాయకరమైనవాడు. కాబట్టి యీ హంతకుని భయాన్ని తొలగించుకొనడం మనకు ప్రథమ కర్తవ్యం" అన్నది. అప్పుడు చందకవి- "భారతేశ్వరికి జయ మగుగాక! తమరు చేసిన ఆలోచన చాల ఉత్తమమైనది. ఈదాసు డెప్పుడో యీ విషయాన్ని తమతో విన్నవింప దలచుకొన్నాడు తమ యాజ్ఞయితే స్వయంగా నేనే పత్ర వాహకుడుగా వెళతాను" అని అన్నాడు. మరల మహారాణి "కవీ! తమరు మహామంత్రితో సంప్రదించి ఉత్తరం వ్రాయండి. తరువాత రాజదూతగా పత్రం తీసుకొని వెళ్ళి రండి." అనిచెప్పి మహారాణి వెళ్ళిపోయింది.

తెల్లవార బోతుంది. వెన్నెల పిండి యారబోసినట్లు కాస్తూంది. జయచంద్రుడు విచారంతో కూర్చొని రెప్ప లార్పకుండా చూస్తూ ఆలోచిస్తున్నాడు. దూరంగా మంత్రు లంతా మంత్రముగ్ధులై, చింతామగ్నులై కూర్చున్నారు. చందకవి ప్రశాంతంగా పర్వతంవలె కూర్చున్నాడు. దీపాలు వెలుగుతున్నాయి. గాలి ఊపులకు దీపశిఖలు తలలు వంచు

తున్నాయి. జయచంద్రుడు పెద్దనిట్టూర్పు విడిచి "కవీంద్రా తమరు మహారాణియొక్క ఉత్తరం చదివి విని పించండి" అన్నాడు. చందకవి లేచి వినయంగా తల వంచి ఉత్తరం బయటకుతీసి కండ్లకద్దుకొని – "మహా రాజా! సావధానంగా వినండి. ఇక్కడ కూర్చున్నవా రంత శ్రద్ధగా వినండి." అని మేఘధ్వనిలా గర్జించి చందకవి చదువసాగాడు. అక్కడ నున్నవారంతా చాతక పక్షులవలె ఒక్కొక శబ్దాన్ని ఒక్కొక నీటిచుక్కవలె ఆనందంగ హృద యంగమం చేసుకొంటున్నారు. ఉత్తరం క్లుప్తంగానే ఉంది. కాని చాకువలె శరీరాన్ని చీల్చుకొని హృదయంలోకి జొరబ డుతూ ఉంది. ఉత్తరంలో ఇలా వ్రాయబడిఉంది – "ఆర్య జననికి జయమగుగాక! ఆర్యభూమి వృత్తాంతమంతా తమ రెరుగుదురు తమరే యీ సర్వనాశన యజ్ఞానికి పురోహి తులు. ఈ నీచనాటకానికి తమరే ఈర్ష్యచేత ప్రేరితులై సూత్రధారు లయ్యారు. తమ ఆర్యపుత్రులై ఉండికూడ ఆర్యజనని హృదయాన్ని త్రొక్కుకొంటూ ముందుకు వెళ్ళ డానికి అనార్యుల కవకాశ మిచ్చారు. ప్రపంచంలో అనేక రకాల పాపులున్నారు. కాని దేశద్రోహం చేసిన పాపిని చూస్తే నరకంకూడ కంపిస్తుంది. భూమి వణకిపోతుంది. దేశ ద్రోహికి బ్రతకడానికధికారం లేదు. మరణం కూడ అతన్ని చూచి అసహ్యించుకొంటుంది. తమ పాప భూయిష్టమైన

శరీరం యింకా పిశాచంవలె బ్రతికేవుంది. అదే నాకు దుఃఖ కరం తమరు పాపకళంకాన్ని స్వయంగా నెత్తిన రుద్దుకొన్నారు. ఇప్పటికైనా తమరు ఈ తుచ్ఛకార్యాన్ని వదలివేస్తారని ఆశిస్తున్నాము. సత్యమైన ఒక విషయాన్ని చెపుతున్నాను. మరువకండి. భారత సామ్రాట్టు మహా నిద్రలో మునిగిపోయారు. అయినా వారి కత్తిపదును మాత్రమింకా అలాగేఉంది. ఇప్పుడు తమతో మాట్లాడేది సంయుక్త కాదు భారత దేశాధీశ్వరి. కాబట్టి తమ యభిప్రాయ మేమిటో చెప్పండి." ఇదివిన్న జయచంద్రుడు తుఫాను దెబ్బతిన్న డేగ వలె వికలత్వం చెందాడు. నిద్రలో ఉలికిపడినట్లు ఉలికిపడ్డాడు. అంతా నిశ్శబ్దం దూరంగా కోయిల కూతలు బాధతోకూడిన మూల్గులవలె వినిపించాయి. చందకవి నుదుటి చెమటను తుడుచుకొని పెద్ద నిట్టూర్పు విడిచి - "మహారాజా! ఉత్తరం తమకు స్వీకారమేనా?" అని ఉత్తరం జయచంద్రునకిచ్చాడు. దానిని తీసుకొనునప్పుడు జయచంద్రుని చేయి కంపించింది, హృదయం కొట్టుకొనసాగింది. జయచంద్రుడు కన్నీటితో, గద్గద స్వరంతో —"కవీశ్వరా! మహారాణి వ్రాసినదంతా యదార్థమే. నేను ఈర్ష్యతో చెడ్డపనిచేసిన మాటవాస్తవమే. నిజంగా నేను ఆర్యభూమిని నాశనంచేశాను. మాతృభూమి నేడితరుల పాదాక్రాంతమయిన మాటనిజమే. నాపాపంవల్లనే దేశం శత్రువులపాలై పోయింది. ఆర్యజాతి పరాధీనమై

పోయింది. నేనునింటిలోనంటించిన నిప్పే సర్వాన్నినాశనం చేసింది. నేనుఆర్యుడనయ్యుండికూడ మాతృభూమిని అనార్యులకు దాసిగాచేశాను. ఆర్యభూమిచరిత్ర వ్రాయబడేసమయానునా యీకూరకృత్యాన్ని వర్ణిస్తారనీ,యుగయుగాలవరకు దానిని చదివినవారు నన్ను ఈర్ష్యతో నిందిస్తారని ఎరుగుదును. కవీ! నేను దేశద్రోహిని. పారిపోయి యెక్కడదాక్కొనగలను. ఆకాశం ఉమ్మివేస్తుంది. భూమిఇప్పుడు పశ్చాత్తాపడుటకు గూడసమయంలేదు. కవీశ్వరా! తమరువెళ్ళి మహారాణితో— "ఢిల్లీపతిబంధింపడి ఉన్నారనిశత్రువులు వారికండ్లను పీకివేసి బాధపెట్టారనిచెప్పండి" అన్నాడు. చందకవి ఇదివిని ఉలిక్కిపడి సంతోషదుఃఖాలతో ఒక్కసారి కేకపెట్టి —"ఆర్యపతి జీవించే యున్నారా? ఇంతవరకు బ్రతికేయున్నారా? తమరు స్వయంగా చూశారా? లేక ఎవరినోటినుండైనా విన్నారా" అని అన్నాడు. అప్పుడు జయచంద్రుడు కన్నీటితో గద్గగ స్వరంతో – "అయ్యో! నేను దురదృష్ట వంతుడను. ఈకండ్లతోనే చూచాను. ఆర్యపతి తన నేత్రాలు పోగొట్టుకొను సమయాన ఈ కండ్లతోనే చూచాను. కాని ఉపాయమేమీ లేదు. పాప పాశంలో బంధింపబడి పోయాను. గోరీకి బానిసనై పోయాను. ఆర్యత్వాన్ని పోగొట్టుకొని పిశాచిలాగ తయారయ్యాను. ఏవిధంగా నేనుకత్తితో ఎదుర్కొనగలను? నాకు సిగ్గువేస్తుంది. ఏనోటితోనేను సంయుక్తతండ్రినని ఆమె

నాకుమాత్రేయని చెప్పకోగలను.? అయినప్పటికీ వినండి తమతో కనోజిరాజు మాట్లాడటంలేదు. వ్యాకులంతో నిం డిన పితృహృదయం మాట్లాడుతూఉంది ఈర్ష్యతోపాపక ళంకాన్నిముఖానికి పూసుకొన్నానో దానినిప్పుడు నారక్తం తోకడిగి వేస్తున్నాను. ప్రపంచం కండ్లుదెరిచి చూచుగాక. కవీంద్రా! తమరువెళ్ళి మహారాణితో "దేశద్రోహి జయ చంద్రుడు ఖడ్గంచేతధరించి వచ్చాడని చెప్పండి. ఇంక దేశ మాతసంకెళ్ళు తెగిపోనంతవరకు తీసినకత్తి ఒరలోపెట్టనని ప్రతిజ్ఞచేస్తున్నాను అన్నాడు. అదివిన్నిచందకవి మహా రాజుకు"అని జయధ్యానంచేశాడు.

చందకవి మనస్సు సుఖదుఃఖాల రెంటితోనిండి పోయింది. బాణంలాగ మహావేగంతోహస్తినాపురం బయల్దే రాడు. శరీరంకంటే మనస్సే ముందుపరుగెత్తుతూఉంది. సైనిక శిబిరంవలె తయారైన ఢిల్లీని చూచి అతడాశ్చర్యపడ్డాడు. ఆర్యస్త్రీలు తమ భర్తలను, పుత్రులను, వీరవేషాలతో అలంక రించి ఉత్సాహంతో పంపుతున్నారు. వృద్ధులు, రోగులు నిరుత్సాహంతో ఏడుస్తున్నారు. ఏనుగు ఘీంకారము విని సింహమెలా సహించగలదు? ప్రజలంతా గర్వంతో ఆయు ధాలు తీసుకొని రోషజ్వాలలతో నిండిన హృదయాలతో తిరుగుతున్నారు. "చంపు, నరుకు" అను ధ్వనులు అన్ని వైపుల ప్రతిధ్వనిస్తున్నాయి. యుద్ధవాద్యాల ధ్వని విని రక్తం

ఊడు కత్తి పోతూ ఉంది. ఆర్యవీరులంతా ఆజ్ఞకోసం తహతహ లాడిపోతున్నారు. నగరం వెలుపల గుర్రాలు, ఏనుగులు లెక్కకుమించి ఉన్నాయి. ఆర్యసేనా శిబిరాలకంతులేదు. అన్నిటికి మధ్య ఆర్యధ్వజం బంగారు స్తంభంపై విజయ చిహ్నంగా ఎగురుతూ ఉంది. మగధరాజు, అంగరాజు, వంగ రాజు వచ్చారు. విదర్భ, పాంచాల దేశాధీశులు వచ్చారు. ఈ విధంగా మండలాధిపతులందరూ భారతేశ్వరి ఆజ్ఞతో సేనల నలంకరించుకొని వచ్చారు. ఆర్యదేశమంతా నేడు ఆర్యధ్వజం క్రింద ఒకేసారి చావడానికి తయారయింది. భేద భావాలన్నీ మరచిపోయారు. చందకవి ఈ దృశ్యం చూచాడు. అతని భుజాలు ఉప్పొంగాయి. గుర్రంపైనుండి ఉత్సాహంతో ఒక్క దూకుదూకి ఒరనుండి కత్తిని లాగి పవిత్ర ఆర్యధ్వజా నికి సైనిక వందనం చేశాడు. అతని కండ్లు వ్యాకులత్వంతో ధీరుడైన పృథ్వీరాజును మహాయోధుడైన కనదేవుణ్ణి యముని వంటి శ్రీ సమరసిని వెదుకుతూ ఉన్నాయి. వారు లేని లోపం కవి హృదయంలో ముల్లువలె గ్రుచ్చుకొంటూ వుంది.

## 10

కృష్ణాభిసారికవలె చీరను సవరించుకుంటూ రాత్రి ప్రశాంతంగా భూమిపై వ్యాపించింది. ప్రపంచమంతా చీకటి సముద్రంలో మునిగిపోయింది. పర్వతాలు యమవాహనమైన దున్నపోతులవలె, చెట్లు ప్రేతాలవలె కనబడుతున్నాయి. గుడ్లగూబల కఠినస్వరాలు ప్రతిధ్వనిస్తున్నాయి. రాత్రి రెండవ జాము. భయంకర సమయం. వ్యాకులంతో, భయంతో ఒక గుఱ్ఱపురౌతు గోరి శిబిరంవైపు మార్గంలో భయంకరారణ్యంలో ప్రయాణం చేస్తున్నాడు. అతడు నాల్గువైపులజూచి బాధతో మూల్గసాగాడు, గుఱ్ఱము ఒక్క అడుగుకూడా ముందుకు సాగడంలేదు. కాని కొరడా దెబ్బలు తిని ముందుకు వెళ్ళి మళ్ళీ ఆగిపోతూ ఉంది. ఆకలితో, దాహంతో అలసి సగం చచ్చిపోయింది. గుఱ్ఱంకంటెకూడ రౌతు క్షీణించి అలసిపోయి వున్నాడు. గొంతు ఆరిపోయింది. శ్వాస ఆగిపోతూ ఉంది. అధరంలో అమృతాన్ని వెదకుతున్నట్లు అతడు మాటిమాటికి పెదవిని చప్పరిస్తున్నాడు. నుదుటి చెమటను తుడుచుకొంటూ నక్షత్రాలను చూస్తూ ఎంత రాత్రి గడిచిందో యింకా ఎంతదూరం ప్రయాణం

చేయాలో అంచనా వేస్తున్నాడు. కొంతదూరం వెళ్ళేసరికి అతనికొక కేక వినిపించింది. అది దగ్గరలోనే ఉన్న గోరీ డేరాల కాపలావారు హెచ్చరికలు చేసుకొను ధ్వని. ఇది విని ఆ రౌతు ధైర్యం తెచ్చుకొని గుఱ్ఱం వీపు చరిచి దాని భుజాలను ముద్దు పెట్టుకొని — "నీకు ధన్యవాదాలు! అలసట పొందిన నా హృదయానికి నేను బ్రతుకుతానని, బ్రతికి సుల్తానుదగ్గరకు చేరగలనని ఎంతమాత్రమూ నా కాశ లేదు, కాని యిప్పుడు ప్రాణాలతో చేరగలిగాను. చాల అదృష్ట వంతుడను. అబ్బ. కంఠ మారిపోతూ వుంది. తల తిరుగుతూ వుంది. నూనె అయిపోయింది. రాత్రి చాలా వుంది. ఎంత వరకు ఈ దీపం చీకటితో పోరాడగలదు? ఒకవైపు ఆశ "ముందుకు సాగమని" కేకలు వేస్తూవుంది. మరొకవైపు మృత్యువు "ఆగి నావైపు చూడు" నేను నీకు ముఖ్యమైన స్నేహితురాలను అని చెపుతూ వుంది. ఆశ త్రాళ్ళతో బిగించి ముందుకు లాగుతూ వుంది. మృత్యువు ప్రాణాలను పట్టుకొని వెనక్కు లాగుతూ వుంది. ఈ విధంగా మానవ జీవితం అర్థంకాని సమస్యవంటిది. రెండు వైపుల సమానమైన ఆకర్షణ. మధ్యలో జీవితం నాశనమైపోతూంది. ఆగడం అసంభవమే. ముందుకు వెళ్ళడం అసంభవమే. ఈ మానవలోకం ఒక కఠినమార్గం గదా? గుఱ్ఱపు రౌతు మరొకసారి ముఖంపై చెమట తుడుచుకొని నిట్టూర్పు విడచి మూల్గుతూ నిర్జనార

ణ్యంలో ముందుకు సాగాడు. చల్లనిగాలి అడవిమల్లెల వాస నతో కలిసి విర్రవీగుతూ వీచింది. నిశారాణి గజ్జెలకాళ్ళతో నృత్యం చేస్తున్నట్లు కీచురాళ్ళ ధ్వని ప్రతిధ్వనిస్తూ వుంది. అతడు ముందుకు వెళుతున్నాడు కాని అతని దేహంమాత్రం మూర్ఛిల్లి క్రింద పడబోతూ ఉంది. గుఱ్ఱం ఆగుతూ ఆగుతూ ముందుకు నడుస్తూ వుంది. గుఱ్ఱానికి గుఱ్ఱపురౌతుకుకూడ అది ఆఖరు స్థితిగా వుంది. ఈ విధంగా ఆ రౌతు సాహసమనే త్రాటిని బట్టుకొని శిబిరం దగ్గరకు చేరాడు. గుర్రం పడి పోయింది. అతడుకూడా పడిపోయాడు. కాపలావారు పరు గెత్తుకొని వచ్చి అతన్ని చేతుల్లో ఎత్తుకొన్నారు. గుర్రం మరణించింది. వైద్యులు వచ్చారు. వుపచారాలు చేసిన తరువాత అతడు స్పృహ తెచ్చుకొని మూల్గుతూ—"అయ్యా! త్వరగా నన్ను సుల్తానుగారి వద్దకు తీసుకొని పొండి. ఆలస్య మైతే అనర్థం జరుగుతుంది. నేను గూఢచారి హస్తినాపురము నుండి కొంత రహస్య సమాచారం తెచ్చాను." అన్నాడు.

యవనపతి గోరీ ఆనందంలో మగ్నమై కూర్చొని ఉన్నాడు. గాయకురాండ్రు త్రాగి మత్తెక్కి వున్నారు. వాయి ద్యాలన్నీ చిందరవందరగా పడివున్నాయి. రాజ్యమదము, ఘూటైన మద్యమ మదము, యుద్ధ విజయమదము మూడూ కలిసి గోరీని గ్రుడ్డివానిగాను, కుంటివానిగాను. తయారు చేశాయి. ఇంతలో ఒక కాపలావాడు భయపడుతూ వచ్చి

సలాముచేసి:—ఒక గూఢాచారి రహస్య సందేశాన్ని తీసుకొని వచ్చాడు. అతడు మరణావస్థలో వున్నాడు. తమతో యిప్పుడే విన్నవించుకొనుటకై ఆజ్ఞ కెదురు చూచుచున్నాడు. ఇది విని గోరీ తన చేతిలోని సారాపాత్రను విసరి పారవేసి తూలుతూ లేచాడు. కావలావాని సాహాయంతో తూలుతూ శిబిరం బైటికి వచ్చాడు. వేలకొలది నక్షత్రాల కాంతిలో గుప్తచరుడు నేలపై మౌనంగా పడివున్నాడు. నిపుణులైన వైద్యులు అతనికి ఉపచారాలు చేస్తున్నారు. కొంతసేపటికిస్పృహవచ్చింది. ఆ వీరుడు చక్రవర్తిని జూచి:— "నా జీవితం సఫలమయింది. ప్రభువులకు ధన్యవాదాలు, నేను లేవలేని స్థితిలోవున్నాను క్షమించండి. నా ప్రాణాలు పోవడానికి సిద్ధంగా ఉన్నాయి. నాలో శక్తి లేదు, కాబట్టి తమరు జాగ్రత్తగా వినండి విన్నవిస్తాను. నేను ఢిల్లీనుండి వస్తున్నాను. అక్కడ జరిగినస్థితి అంతా నా కండ్లతో చూచాను. చెవులతో విన్నాను. ఈ దేశంలో వున్న చిన్న పెద్ద రాజులందరూ నేడు ఒక్కటై ప్రాణాలకు తెగించి తమ నెదుర్కోటానికి తయారయ్యారు. లెక్కకు మించిన ఆర్య సైన్యం ఢిల్లీవైపు వస్తూవుంది. జయచంద్రుడుకూడా యుద్ధంలో మహారాణికి సహాయం చేస్తానని చందకవితో సందేశం పంపించాడు. ఢిల్లీపతికి తమకు జరిగిన పూర్వాపు యుద్ధంలో తమకే విజయం లభించింది అప్పుడు జయచంద్రుడు

ద్రోహిగా వున్నాడు. ఇప్పుడు తమకు ఆర్యదేశానికి భయంకరయుద్ధం జరుగబోతూ వుంది ఆ వార్త తమకు తెలుపుటకై వచ్చాను. హృదయంలోని బరువు తొలగి పోయింది. కాని మరొక దుఃఖం బాధిస్తూవుంది. నేడు దుర దృష్టంవల్ల నేను "కాఫిర్"ల దేశంలో మరణిస్తున్నాను. మృత్యువు నన్ను మాతృదేశంనుండి యిక్కడికి లాక్కొ చ్చింది. ఎక్కడ పుట్టానో అక్కడ మరణిస్తే బాధవుండేది కాదు. కాని మరొక సంతోషమేమంటే ఏ భూమిపై ప్రాణాలు వదుల్తున్నానో అది నా చక్రవర్తి కాళ్ళక్రింద పడివున్నది. అదే నాకు సుఖం. ఎదురుగా నా దేశపు జండాను చూస్తున్నాను. నా దేశ సోదరులంతా ఎదురుగా నిలబడి వున్నారు. నా దేశానికి, నా చక్రవర్తికి జయమగు గాక" అని గుప్తచరుడు ఆగిపోయాడు. గోరీ నిశ్చేష్టు డయాడు. అతని మత్తు దిగిపోయింది. అక్కడ వున్నవారంతా వ్యాకులపడ్డారు. భయంతో ఒకరి ముఖాలొకరు చూచు కొంటున్నారు. చతురుడైన గుప్తచరుడు జీవిత భారాన్నుండి, కార్యభారాన్నుండి విముక్తిపొందాడు. గోరి నిట్టూర్పు విడచి:—"ఇప్పుడితనిని సైనిక సంప్రదాయం ప్రకారం పాతి పెట్టండి. ఈ దేశభక్తునివలె మృత్యువు పొందినవారు చాలా తక్కువగా కనబడతారు. ఈతడు లేనిలోపం మనకు బాధ గానే వుంటుంది. దేశానికి మూలధనమైన ఈ రత్నాన్ని పోగొట్టుకొని నేను దరిద్రుడనయ్యాను.

సేనాపతులంతా ధైర్యం గోల్పోయి కూర్చొని వున్నారు. గౌరీ దుఃఖంతో:— "మీరు వెంటనే ఢిల్లీపతిని గజనీకి పంపివేయండి, ఆలస్యమైతే మన చావు బ్రతుకులకు యిది అంతిమ సమయం ఈ యుద్ధఫలితం ఏమౌతుందో ఎవరికి తెలుసు? మనం గృహసుఖంగాని, రాజ్యసుఖంగాని ఎరుగం. పగలంతా యుద్ధం, రాత్రులు స్వప్నంలో "చంపు నరుకు, అనే శబ్దాలే వింటూవున్నాము. జయచంద్రుడు పిరికివాడు. వానిలో వీరత్వమే వుంటే దేశక్షేమానికి సిద్ధపడేవాడే. వాడిఎదురుగానే పృథ్వీరాజు కండ్లు పెరికివేయబడ్డాయి గదా! వారి దృశ్యాన్ని కండ్లతో చూచికూడా పౌరుషహీనంగా పడివున్నాడు. వాడు తలచుకుంటే ఆ క్షణంలో నా తల నరికివేయగలిగేవాడే. ప్రక్కనే కూర్చున్నాడు ప్రాణభయంతో అట్టి తుచ్ఛ జయచంద్రుని వలన మనకేమి భయం? ఆత్మబలమే విజయానికి కారణమని మీరంతా ఎరుగుదురుగదా! దేశద్రోహియైన జయచంద్రునిలో ఆత్మబలం ఏమాత్రం కూడా లేదు. కాని నేను మహారాణి ప్రభావానికి భయపడుతున్నాను. ఆమె చూస్తూ చూస్తూ వుండగానే సమస్త ఆర్యదేశ సేనను సంఘటిత పరచింది. ఈ ప్రయత్నంలోనే పృథ్వీరాజు విఫలుడయ్యాడు. పురుష సింహంకంటె స్త్రీసింహమే భయంకరంగా కనిపిస్తూ వుంది. మహావీరుడైన పృథ్వీరాజును బంధించి భారతదేశ వీరత్వానికి నిదర్శనంగా

గజనీకి పంపగలిగినందుకు నేను ధన్యుడనయ్యాను. వీరుల పూజ భగవంతుని పూజయని పెద్దలు చెప్పిన విషయం నేడు నేను సత్యమని తెలుసుకున్నాను.

ఘోరీ శిబిరానికికి ఎదురుగా మరొక భయంకర శిబిరం ఉంది. దానికి నాల్గువైపుల వందలకొలది యుద్ధవీరులు రాత్రిం బగళ్ళు అస్త్రాలతో తిరుగుతూ వున్నారు. ఘోరీ శిబిరంలోపల ఒక భయంకరమైన యినుపబోనులో పృథ్వీరాజు యినుప గొలుసులతో బంధింపబడి వివశుడై పడి వున్నాడు. అర్ధ రాత్రి సమయంలో ఘోరీతో కలిసి కొంతమంది సైనికులు ఆయుధాలు ధరించి వచ్చారు. పృథ్వీరాజు మదపుటేనుగవలె ఎండుగడ్డిపై కూర్చొని వున్నాడు. ఘోరీ —"మహారాజా! క్షమించండి. తమకిచ్చ్చట చాలా కష్టంగా వుంటుందని భావించి గజనీకి పంపుతున్నాను." అన్నాడు. ఈమాట విన గానే పృథ్వీరాజు రోషంతో గర్జిస్తూ పండ్లుకొరికి లేచినిలబ డ్డాడు. ఇనపచువ్వలబోను ఝునఝునశబ్దంతో ఊగులాడింది. ఘోరి భయంతో వెనక్కు ఒక్కదూకు దూకాడు. కాపలా వాళ్ళు భయంతో వణకసాగారు. పృథ్వీరాజు గర్జించి:— "ఇది మూడవజాము. బంధించావు. అంధుణ్ణిచేశావు. అయిన ప్పటికి స్వదేశమాత ఒడిలో వుండనిచ్చావు. అదేనాకు చాలా సంతోషాన్ని కలిగించింది. ఘోరీ! ఇప్పుడే నీవు నన్నుముక్క లుగానరుకు, కాని ఇంతవరకు నేను దయచూపించాను. కాని

జ్ఞాపకముంచుకో. నే నీజన్మలో త్రిలోకాధిపతినికూడ, పాట పాటునకూడ దయాభిక్షకోరలేదు. తల తెగిపోయినా యిష్టమే కాని ఆర్యుడైనవాడు తలవంచడం సహించడు. అయినా నేడు నేను నీదయను కోరుతున్నాను. అన్నాడు. గోరి:—"ఇప్పుడు తమను పంపక తప్పదు. భగవంతుని సాక్షిగా చెపుతున్నాను. నేను వీరారాధకుడను. తమరు మహావీరులు. తమ స్వదేశభక్తికి ధన్యవాదాలు. కానీ నేను పంపక తప్పదు. నన్ను క్షమించండి" అని గద్గగ స్వరంతో అన్నాడు. పృథ్వీరాజు:—"వీరగోరీ! ఒకమాట: నా జన్మభూమి సరిహద్దు సమాప్తమగునప్పుడు నాకు తెలియజేయండి. మాతృభూమి మట్టి నొకసారి ముద్దుపెట్టుకోవాలి. ఇదే నాప్రార్థన" అన్నాడు. గోరి:—"నేను నా కర్తవ్యంకోసం తమకీబాధ కలిగించాను. మాతృభూమినుండి తొలగిస్తున్నాను. తమయాజ్ఞ నేను తప్పక నేరవేరుస్తాను అన్నాడు పృథ్వీరాజు:—ఇది వీరధర్మం నాకుకూడా సంతోషమే. యుద్ధంలో వీరుడైన నిన్నెదు ర్కొని ఓడిపోయాను. కాని ఆర్యులు ఎల్లప్పుడు వీర ధర్మాన్నే పూజిస్తూవుంటారు. ఒకవేళ దేశద్రోహియైన జయచంద్రునికి ఓడిపోయివుంటే నాస్థితి ఎట్లా ఉండేదో ఊహించలేను అన్నాడు.

గోరి:—మంచిది సెలవియ్యండి

పృథ్వీ :—"వీరుడా! ఈ ఆర్యభూమిని కాలితో నలప గలిగావు. కాని దీనితో ఆటలాడటం మంచిదికాదు. గడ్డి యింటిలో కూర్చుని నిప్పుతో ఆటలాడితే భస్మం చేసివేస్తుంది ఆలోచించు"

గోరీ :—యుద్ధభూమిలో మృత్యువు అదృష్టవంతులకే దొరుకుతుంది నేను పిడుగును గుప్పిటలో పట్టుకొనగలిగాను. అదే నాకు సంతోషం

## 11

భాద్రపదమాస భయంకరమేఘాలు పెద్దపర్వతాకారా లతో ఆకాశమంతా ఆవరించాయి. రాత్రికి పగటికి భేదం కని పించడంలేదు. మహిషాసురుణ్ణి నరకిన కాళికాదేవి ఖడ్గంవలె మెరపు మెరసి చీకటిని చెల్లాచెదురు చేస్తూవుంది. పిడుగులు ప్రతిధ్వనిస్తున్నాయి. పక్షులు, పశువులు, మృగాలు, సర్వ జీవులు ప్రాణభయంతో వ్యాకులపడుతున్నాయి. సరిగా అదే విధంగా ఆర్యసేన యుద్ధోన్మత్తమై వుప్పొంగి పోతూ వుంది. నగారా మోతలకు, ఏనుగుల గంటల ధ్వనులకు బ్రహ్మకూడా చెవులు మూసుకొంటున్నాడు. భూమినుండి ఆకాశంవరకు ధూళి వ్యాపించింది. దేవలోకవాసులు భయం

వల్ల గవాక్షాలు (కిటికీలు) మూసివేశారన్నట్లు రాత్రులు కూడా నక్షత్రాలు కనిపించటంలేదు. పెద్ద పెద్ద ఏనుగులు కదిలే పర్వతాలలాగా నడుస్తున్నాయి. గాలిలో సమానంగా గుర్రాలు పరుగెత్తుతున్నాయి. బంగారంవలె ప్రకాశించు రథాలు మనస్సులను ఆకర్షిస్తున్నాయి. రథికులు పెద్ద పెద్ద ధనుస్సులు ధరించి కూర్చున్నారు. సైనికుల లెక్కకు అంతే లేదు. దేశదేశముల రాజులు తమ తమ సేనలతో వెంట నడుస్తున్నారు. వారంతా తమతమ భేదభావాలను మరచి పోయారు. భారతాధీశ్వరి రథంపై శోభిస్తూవుంది. ఆమె తలపై బంగారు రత్నకిరీటము సూర్యునివలె అనేకరంగులతో ప్రకాశిస్తూవుంది. అష్టధాతులతో చేయబడిన కవచాలు ప్రతి అవయవానికి శోభిస్తున్నాయి. పరిస్థితులనుబట్టి పువ్వులు త్రిశూలాలుగాను అమృతం విషంగాను మారిపోతూ వుంటాయి. పువ్వులు ధరిస్తే కందిపోయే కోమల శరీరంగల సంయుక్త నేడు ఖడ్గం ధరించి యుద్ధజ్వాలలో దూకటానికి సిద్ధపడుతూ వుంది. కోమల శిరీషపుష్పం కఠిన వజ్రాన్ని కోయగల సామర్థ్యాన్ని పొందగలిగింది. నీటిని మథిస్తే భయంకర విద్యుఛ్ఛక్తి పుడుతుంది. ఇది నిత్య సత్యం.

అశ్వారూఢులై కుడిప్రక్కన చందకవి, ఎడమప్రక్కన జయచంద్రుడు నడుస్తూవుండగా. మధ్యనభారతేశ్వరి, వీర భద్రుడు, హిమవంతుడు వెంటనుండగా దేశసైన్యానికి ముందు

నడచు పార్వతివలె శోభిస్తూవుంది. నడిచే వీరఆర్యసేనకు పక్షులు పువ్వులు, పండ్లు బహుమతులర్పిస్తున్నాయి. భూదేవి చల్లనినీటిని దానమిస్తూవుంది. చల్లగాలిక్షణంలో అలసటను తీర్చి వేస్తువుంది. మేఘాలువ్యాపించి చల్లనినీడనిస్తూవున్నాయి. లెక్కకుమించిన ఆర్యవీరులు ప్రాణాలకు తెగించి పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగి పొందటానికి వీరత్వంతో వుత్సాహంతో సాగిపోతున్నారు.

ఒక వార్తాహారుడు పరుగెత్తుకొనివచ్చి ఆర్యసేన వృత్తాంతాన్ని గోరీకి వినిపించాడు. గోరి స్తంభించిపోయాడు. సేనాపతులు నిశ్చేష్టులయ్యారు. ఒకరిముఖాలు మరొకరు చూచుకొంటున్నారు. వారికి స్వదేశానికి తిరిగి పోవటానికి అన్నిమార్గాలు బందయిపోయాయి. కేవలం మృత్యుమార్గం మాత్రం తెరువబడి వుంది. నాల్గువైపుల అగ్ని అంటుకొన్న అడవి మధ్యనున్న సింహంవలె వుంది గోరి స్థితి. ఆశలడుగంటి మరణం నిశ్చయమయినప్పుడు మానవుడు యమునివలె తయారవడం నిరాశ చెందిన వ్యక్తి మహాకఠినుడవడం లోక సహజం. గోరీ:—ఇప్పుడు మనం భయంకర నరకాగ్నిలోని గడ్డిపరకలవలె వున్నాము. కానీ భస్మమైపోతామనే భయం లేదు. జీవితంలో మరణం ఒకేసారి వస్తుంది. నేడుగాని వంద సంవత్సరాలకుగాని తప్పను. కాబట్టి చింతించడం వ్యర్థం. మనం మృత్యువులాగ గర్జించి యుద్ధంలో దూకాలి ఇదే

మనకు చివరియుద్ధం. మనం కత్తిపదును యిప్పుడే చూపిం చాలి. ఇది విని సేనాపతి:—"మేమంతా యుద్ధంలో కాఫిరు లను ఎదుర్కొనడానికి సిద్ధంగా వున్నాం. వారు వెయ్యి మందిగాని, కోటిమందిగాని, పదికోట్లమందిగాని చింతలేదు. చిన్న మెరపు మెరసి గర్జించి మేఘాన్ని చిందరవందర జేసి నట్లు యే మృత్యుమేఘాన్ని చీల్చివేస్తాం. మా కత్తి కెంత పదునుందో ప్రపంచానికి చూపిస్తాము" ఇంతలో ఒక కాపలా వాడువచ్చి:—"అయ్యా! ఒక దూత రాణి సందేశాన్ని తీసుకొనివచ్చాడు. తమఆజ్ఞ కెదురుచూస్తున్నాడు అన్నాడు." "గౌరవంగా లోనికి పంపు"మని గోరి అన్నాడు.

శాంతభావంతో తేజో స్వరూపుడైన ఆర్యదూత లోనికి ప్రవేశించాడు. అతడు నాల్గువైపుల కలయచూచి గంభీరంగా:—మాతృభూమికి జయమగుగాక, భారతేశ్వరి ఆజ్ఞప్రకారం వచ్చాను.

గోరి :—మహారాణి సందేశమేమో నిర్భయంగా చెప్పవచ్చు.

దూత ;—భారతేశ్వరి సందేశమేమనగా "తమరు ఢిల్లీపతిని తిరిగి పంపించి ఈ దేశంనుండి వెంటనే వెళ్ళిపొండి. తమరు స్వయంగా భవితవ్య నిర్ణేతలు, జరుగుబోవు మహా యుద్ధాన్నిగూర్చి బాగా ఆలోచించండి.

గోరి : — ఆలోచించాను, బాగాఆలోచించాను. రాబోవు ఫలాఫలితాలనుగురించికూడా యిప్పుడు తిరిగి ఆలోచించవలసిన అవసరం ఏమీలేదు. నీ ప్రశ్నకు తగిన సమాధానం రేపు యుద్ధక్షేత్రంలో స్వయంగా మహారాత్రికి యిస్తాను.

దూత :—"తమ చిత్తం" అని నాల్గువైపుల మరల కలయజూచి శలవు తీసుకొన్నాడు.

పతివ్రత భర్త చితిలో భస్మమగుటకు వచ్చినట్లు "ఉష" ఎర్రని ముసుగు ధరించి వచ్చింది. ఆకాశంతో ప్రకాశించే నక్షత్రాలూ దుఃఖతులైన బంధువులవలె కనబడుతున్నాయి. చితి ప్రజ్వరిల్లినట్లు నెమ్మదిగా కాంతి వ్యాపించింది. అగ్నిజ్వాలలవలె సూర్యకిరణాలు ఆకాశంపైకి వచ్చాయి చిత్రాగ్నివలె సూర్యుడు కనిపించాడు. ఈవిధంగా భారతదేశంలో జరుగబోవు నరమేధ యాగదినాంగా సూర్యోదయ మయింది. ఒకవైపు ఆర్యసేన, మరొకవైపు శత్రుసేన యుద్ధానికి సిద్ధమయ్యాయి. మధ్యన విశాలమైన మైదానం భారతభాగ్యాన్ని నిర్ణయించే చదరంగంవలెవుంది. చూస్తూ చూస్తూ వుండగానే రెండు సేనలు ప్రళయ ఝంఝూ మారుతంవలె విజృంభించి యుద్ధం చేయసాగాయి. భూమి కంపించింది. నదులు ఎదురు ప్రవహించాయి. స్వర్గంలోని ఇంద్రాసనంకూడా కంపించింది. యుద్ధ సముద్రంలో అనేక

ఏనుగులు కుండల్లాగ మునిగిపోయాయి. ఇక గుర్రాలనుగూర్చి చెప్పవలసిందేముంటుంది. కత్తులు మెరుపుల్లాగ మెరుస్తు న్నాయి. శవాలు కుప్పలు కుప్పలుగా పడుతున్నాయి. హాహాకారాలు వ్యాపించాయి. చేతులు, తలలు తెగి దూరంగా పడుతున్నాయి. శత్రుమిత్రులనే భేదం చూడకుండా వీరులు యుద్ధక్షేత్రంలో విహరిస్తున్నారు. భారతేశ్వరి రథంపై నెక్కి చేత ధనస్సు ధరించి రణచండికవలె కనబడుతూవుంది. ఆమె యెదుట క్షణం నిలువగల వీరుడెవడూ కనుపించటంలేదు. ఆమె రథం శత్రు శవాలుమీద తప్ప భూమిమీద నడవటం లేదు. జయచంద్రుడు ఏనుగుమీద చందకవి గుర్రంమీద ఎక్కి భయంకర స్వరూపులై శత్రు సంహారం చేస్తూ భార తేశ్వరికి యిరుప్రక్కల నడుస్తున్నారు. మధ్యాహ్న మగు నప్పటికి గోరి సేనలో సగానికి పైగా నశించిపోయింది. మిగి లిన సేన అధైర్యంతో వ్యాకులత్వంతో మృత్యు ముఖంలో పడివుంది. అప్పుడు గోరి ఏనుగుపై నెక్కి మహారాణి ఎదుటకు వచ్చాడు. గోరీని చూడగానే ఆమె :—వీరులైన సుల్తాను గారు! స్వాగతం! ఇక్కడున్నాను. చూడు. ఇది యుద్ధభూమి. నిన్న తమరు దూతతో యుద్ధభూమిలో నాకు సమాధాన మిస్తానని చెప్పారూ, ఏదీ" అని కేక వేసింది. గోరి:—"దేవీ! జయచంద్రుని వెదుకుతున్నాను. వారెక్కడున్నారు? తమ ప్రశ్నకు సమాధానము యిచ్చుటకు నేను తగను. తమరు

క్షమించండి" అని సగౌరవంగా తలవంచి అన్నాడు. ఇంతలో జయచంద్రుడు రోషంతో పండ్లు కొరుకుతూ :—"సుల్తాను! ఇటు దయచేయండి. ఒకప్పుడు తమరన్నారు. జ్ఞాపక ముందా? ఈ దేశం కాళ్ళకింద వుంది ఈ పిరికి దేశంలో నన్నె దుర్కొనగల సమర్థులెవరున్నారు? అని" - అప్పుడు విధి వక్రంగా వుంది. ఆ మాటను హృదయంలో పెట్టుకొని సమ యంకోసం రోజులు గడుపుతూ వచ్చాను. తమ ప్రశ్నకు తృప్తిగా సమాధాన మివ్వటానికి సిద్ధంగా వున్నాను. కాస్త కాచుకోండి "గర్వానికి సమాధానం కత్తితో యివ్వాలి" అనే భారతదేశ నీతిని ప్రపంచమంతా బాగా ఎరుగును. అని జయచంద్రుడు గర్జించి ధనస్సును తీసి తీక్షణ బాణాలు గోరీ ఏనుగుపై కురిపింపసాగాడు. సుల్తాను కవచం చిందర వందరై పోయింది. దెబ్బతినిన ఏనుగు మోకాళ్ళను కిందకు ఆన్చింది. గోరి దానిపైనుండి కిందకు దిగి గుర్రంపై నెక్కి ఎదుర్కొన్నాడు. భయంకర యుద్ధం చెలరేగింది. ఆయుధాల ధ్వనితో ఆకాశం అదిరిపోయినది. రెండు సేనల గుండెలు ఆగిపోయాయి. బొమ్మల్లాగ యుద్ధవీరుల యుద్ధకౌశలం చూడ సాగిరి. బద్ధవైరముతో రెండు పెద్దపులులవలె పోట్లాడు నా వీరులను ఒకప్పుడు ఆర్యసేన, మరొకప్పుడు వైరిసేన ఉల్లా సంతో ఉప్పొంగిపోతున్నాయి. ఇంతలో అకస్మాత్తుగా ఒక వైపునుండి వజ్రాయుధంవలె ఒక బాణంవచ్చి జయచంద్రుని

కుడికంటిలో దూరి వెనుక వైపుగా వెళ్ళిపోయింది. వజ్రా యుధంచేత కూలిన హిమశిఖరంవలె జయచంద్రుడు ఏనుగుపై నుండి క్రిందకు కూలిపోయాడు. గోరీసేన వీరనినాదాలు చేసింది. ఆర్యసేన క్షణం స్తంభించి తిరిగి అగ్నిజ్వాలవలె ప్రజ్వరిల్లింది. తుఫాను గాలికి గడ్డిపరకలు ఎగిరిపోయినట్లు గోరీసేన చిందరవందరై నశించిపోయింది, కేవలం చచ్చిన వాళ్లను చావుకు సిద్ధంగా వున్నవాళ్ళను తప్ప గోరీ సేనలో మిగిలిన వీరుడే లేడు. ఆర్యుల కత్తులు ఆగిపోయాయి చచ్చిన వారిని చంపడం సబబుకాదు గదా! ప్రపంచంలో మరల ఆర్యులు అజాత శత్రువులయ్యారు. అంధకార సముద్రంలో మునిగిపోయిన ఆర్య స్వాతంత్ర్యం తిరిగి ఆవిర్భవించింది. ఆర్య జాతి జయ జయాకారాలతో ఆకాశం ప్రతిధ్వనించింది ఆర్య పతాకం గర్వంతో ఎగురసాగింది. అసంఖ్యాకమైన శవాల మధ్యనుండి చందకవి ముందుకు వచ్చి ఆర్యపతాకానికి అభి వాదంచేశాడు. మహారాణి దెబ్బతిన్న జయచంద్రుని ఎత్తుకొని తనశిఖరానికి తిరిగి వెళ్ళింది. ఆమె వెంట విజయోత్సాహంతో కూడిన ఆర్యసేన కీర్తిదేవత, స్వాతంత్ర్య లక్ష్మికూడా వెళ్ళి నారు. యుద్ధం ఆగింది ప్రొద్దు క్రుంకింది. ఆకాశమంతా బంగారుకాంతి అలరారుతూవుంది. సూర్యుడు పశ్చిమ భవ నంలో ప్రవేశించాడు. చంద్రుడు తూర్పుదిక్కున తొంగి చూచాడు. చల్లని పిల్లగాలులు వీచాయి. స్వతంత్ర భారతంలో తిరిగి నిశారాణి చిరునవ్వుతో ప్రవేశించింది.

## 12

నిశాదేవి ఆనందంతో కిలకిల లాడుతూ వచ్చింది. వెన్నెలతో లోకమంతా తెల్లబారింది అసంఖ్యాకమైన నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. ఆర్యసేనవిజయోత్సాహంతో ఆనందంగావుంది. కవచాలు ధరించి వచ్చు కత్తులతో కొందరు వీరులుజాగరూకతతో కాపలా కాస్తున్నారు. అస్థిపంజరంమధ్య సురక్షితంగా నున్న హృదయంవలె మహారాణి శిబిరం వందల కొలది శిబిరాలమధ్య సురక్షితంగా వుంది. శిబిరం ఎదుట "ఆర్యపతాకం" ప్రశాంతంగా ఎగురుతూ వుంది. పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగి పొందిన ఉత్సాహంతో ఆర్యసేన ఆనందాన్ని అనుభవిస్తూ వుంది. (నిప్పులు చెరిగే వేసవికాలం తరువాత వచ్చే మబ్బు, భయంకర దుఃఖం తరువాత వచ్చే సుఖం ఇవి హృదయానందాన్ని గల్గిస్తాయి. విలువైన వస్తువు తేలిగ్గా లభిస్తే దానికి గౌరవం వుండదు. ఇది ప్రపంచ నియమం.)

శిబిరం లోపల భారతేశ్వరి కూర్చొనివుంది. ఆమెకు ఎదురుగా సమస్త ఆర్యభూపతులు కూర్చొని వున్నారు. సైన్యాధ్యక్షులు, మంత్రులు అంతా ఆలోచనా సముద్రంలో

మునిగి కూర్చొని వున్నారు. మహారాణి కెదురుగా చందకవి రుద్రతేజంగల వీరభద్రునివలె కూర్చొని వున్నాడు. ఒక తెల్లని శయ్యపై జయచంద్రుడు "నూనెలేని దీపం ఆరిపోవడానికి సిద్ధంగా నున్నట్లు మృతప్రాయుడై పడివున్నాడు. అందరూ విచారంగా వున్నారు. రాజవైద్యులు చికిత్స చేస్తున్నారు. మాటిమాటికి చందకవి లేచి రాజునుచూచి దీర్ఘశ్వాస వదలి కూర్చుంటూ వున్నాడు. కవి హృదయంలో సుఖదుఃఖాలనే రెండు తరంగాలు నాట్యం చేస్తున్నాయి.

జయచంద్రుడు వ్యాకులత్వంతో అస్పష్టస్వరంతో:— ఆర్యపతీ! పృథ్వీరాజ! నేనే దేశాన్ని నాశనం చేశాను. క్షమించు. ఈ జయచంద్రుడు దేశద్రోహి. నావంటి దురదృష్టవంతుడు ఆర్యభూమిలో మరెవరుంటారు?" అని తన ఆయురేఖను తుడిచివేయుటకో అన్నట్లు చేతులు నలుపుకొనసాగాడు.

జయచంద్రుని కరుణాక్రందనం విని సభాసదులంతా దుఃఖించారు. చందకవి చలించాడు. మహారాణి హృదయం కంపించింది. జయచంద్రుడు తిరిగి నిట్టూర్పు విడిచి :—అదిగో! ఆకాశంలో భారతమాత సింహంపై నెక్కి కనుపిస్తూవుంది. ఆమె తలపై హిమకిరీటం శోభిస్తూవుంది. సృష్టి స్థితిలయాలకు కారణభూతురాలైన "అంబిక"వలె చేత త్రిశూలం ధరించింది. నా కండ్లు సార్థకం చెందాయి. ఆమె కండ్లలో ప్రేమ నిండివుంది. ఊఁ! ఆర్యసేనలో మరణించిన వీరులంతా దివ్య

రూపాలతో ఆరతులిస్తున్నారు. నేనుకూడా వీరగతి పొంది నట్లైతే నాకూ ఆ అదృష్టం పట్టేదకదా! ఆకాశం ఆ లోక మాత చిరునవ్వు నవ్వింది. అమృతం వర్షించింది ప్రపంచ మంతా ప్రకాశవంతమైంది. అమ్మా ఆర్యజననీ నేనుకూడా వస్తున్నాను. దయచూడు తల్లీ కాస్త చేయూతనిచ్చి నన్నుద్ధరించు.

ఒకసారిగా కేకపెట్టి జయచంద్రుడు కూర్చోన బోయాడు కాని అతని ప్రాణాలు లేచి ఆ తల్లిలో ఐక్య మయ్యాయి. దీపశిఖ వెళ్ళి సూర్యభగవానునిలో కలిసి పోయింది. అల వెళ్ళి ఆనంతసముద్రంలో అదృశ్యమైంది. తాను చేసిన కర్మభారాన్ని ప్రభువున కర్పించి, కీర్తి అపకీర్తులను చరిత్ర కప్పగించి అశాశ్వతమైన శరీరాన్ని ఆర్యభూమికర్పణ చేసి జయచంద్రుడు ఈసంసారసముద్రాన్నుండి సాగిపోయాడు.

చందకవి:— భయంకర నరమేధయజ్ఞానికి నేడు పూర్ణాహుతి ఈ రూపంగా జరిగిపోయింది. ఈ మహానాటకా నికి భగవంతుడు సూత్రధారుడు. మనమంతా పాత్రదారులము. అయినా మన అభినయం ఎప్పుడు పూర్తి అవుతుందో, తెర ఎప్పుడు పడుతుందో మనకు తెలియదు. ఎంత విచిత్రము ఈ ప్రపంచములో ఈ "భావనాటకం" సుఖాంతమో దుఃఖాం తమో ఎవరూ చెప్పలేరు" అన్నాడు. సభాసదులంతా

దుఃఖించారు. భారతేశ్వరి ధైర్యాన్ని వహించి నెమ్మదిగా వెళ్ళి పోయింది.

పుటముపెట్టిన బంగారంవలె జయచంద్రుని శరీరంచితాగ్నిలో భస్మమై పోయింది. ఆభస్మాన్ని వాయుదేవుడు ప్రోగుచేశాడు. మోఘాలు తడిపాయి. అతడు చరిత్రలో ఒక చిన్నకథగా తయారయ్యాడు.

వీరసేనాపతి మహారాణి దగ్గరకువెళ్ళి:—"అమ్మా! మనసేన గోరిశిబిరాన్ని ధ్వంసంచేసి వచ్చింది. కానిమహారాజుగారి జాడ తెలియలేదు. గోరి పారిపోయాడు. భారత సరిహద్దుల్లో వెదకుటకై మన ఒంటెలసేనను పంపించాము. ఎక్కడైనా అతడు మారువేషంలో వున్నాడేమోనని గుప్తచారులను పంపించాము. పవిత్ర మాతృభూమిని సర్వనాశనం చేసిన ఆదుష్టుని గురించి జాగ్రత్తగానే వున్నామని విన్నవించాడు.

మహారాణి:— "డేగగూటిలో సర్పమెట్లదాగుకొంటుంది? సేనకు నాతరుఫున ధన్యవాదాలర్పించండి. వారు తమ రక్తాన్నొడిచి మాతృభూమి గౌరవాన్ని నిలబెట్టారు. కాని ఒక విషయం జ్ఞాపకముంచుకోవాలి. రాహువు యెల్లప్పుడు సూర్యచంద్రులకు శత్రువే. అతనికి తలమాత్రమే మిగిలి వున్నది. అయినా సమయం దొరికితే మింగుదామని పొంచి వుంటుంది. ఓడిపోయిన శత్రువునుగురించి, దెబ్బతిన్న పులిని

గురించి, జాగ్రత్తగా వుండటం బుద్ధిమంతుల లక్షణం. ఆర్య పుత్రులైన చక్రవర్తిని చూడడానికి అందరూ నాకంటేగూడ వ్యాకులపడుతున్నట్లు నాకు తెలుసు. కాబట్టి నేను దౌర్బ ల్యాన్ని వెల్లడి చేయకోరడంలేదు." అని మౌనం వహిం చింది. మంత్రికూడ మంత్రముగ్ధునివలె కూర్చొని గద్గద స్వరంతో "భారతేశ్వరీ! భారత సామ్రాట్టును చూడడానికి మేమంతా వ్యాకులపడుతున్నాము. సూర్యుడులేనిదే పగలు కానట్లుగా మహారాజు శత్రువులకు బందీయై యున్నంతవరకు ఈ విజయాన్ని జయంగా భావించడానికి వీలులేదు. మన కంఠం యమపాశంలో చిక్కి వున్నంతవరకూ, మన దేహం విముక్తి చెందినదని ఎట్లు చెప్పగలం?"

చందకవి మౌనంగా వున్నా అతని మనస్సు భూమి నుండి ఆకాశంవరకూ, అణు అణువునందు పరుగెత్తుతూ సామ్రాట్‌ను వెదకుతూ వుంది. అందరూ ప్రాణాలొడ్డి తమ ధర్మాన్ని పాలించారు. దేశం విముక్తి చెందింది. కాని జాతి ధర్మం "ఆర్య శ్రేష్ఠుడైన పృధ్వీరాజు బందీయై యున్నంత వరకు శాంతంగా కూర్చోవడం పాపమవుతుంది." అని చెబుతూవుంది. ఆర్యజాతి పోయిన గౌరవాన్ని తిరిగి సంపా దించింది. దేశానికి సంయుక్తవంటి మహారాణి దొరికింది. ఉజ్వల సూర్యునివంటి "రైనసి" దేశానికి ఉత్తరాధికారిగా దొరికాడు. ఆర్యసేన విజయాన్ని సాధించి వీరత్వాన్ని

పొందింది. ఆర్యుల విజయంవల్ల ఆర్యచరిత్రకు ఉజ్వలమైన విషయం దొరికింది. కవి కంఠాలు పవిత్ర గీతాలు పాడాయి. ఈ విధంగా ఆర్యభూమికి అణిమాది అష్టసిద్ధులు సిద్ధించాయి కాని చందకవికి యేమిదొరికింది?" ఈ విధంగా చందకవి సందిగ్ధంలో పడ్డాడు.

అర్ధరాత్రి అవబోతూవుంది. తన శిబిరంలో చందకవి వంటరిగా కూర్చొనివున్నాడు. ఒకమూల దీపం మినుకు మినుకుమంటూ వెలుగుతూవుంది. ప్రపంచంలో నిశ్చింతగా యుండేది మహామూర్ఖుడు; మహాయోగి మాత్రమే. అంతా ప్రశాంతంగా వుంది. అలిసిపోయిన సైనికులు నిద్రలో యుద్ధ చిత్రాలు చూస్తున్నారు. కాపలావారి కేకలు శూన్యాకాశంలో ప్రతిధ్వనిస్తున్నాయి నిద్రాదేవి కవి దగ్గరకు వచ్చి చింత అనే సవతిని చూచి తిరిగి పోతూవుంది. కవి ఒకప్పుడు లేస్తూ మరియొకప్పుడు పండు కుంటూ వ్యాకులత్వంతో నిరుత్సాహ పడుతున్నారు. మనో సముద్రంలో చింతఅలలు కొడుతూవుంది. దానిలో కవి నావ వలె వూగులాడుతున్నాడు. రాత్రంతా ఈ విధంగా స్వప్నం లాగ గడచిపోతూవుంది. వ్యాకుల హృదయంతో చందకవి మహామాయ చండికను సంబోధించి ఓ అంబికా! నాలో కర్తవ్యజ్ఞానం నశించింది. నడిసముద్రంలో మునిగివున్నాను. పగలు పోయి రాత్రి వచ్చింది. తేజోస్వరూపిణీ! నాకు

చేయూత నిమ్ము. నేడు ఆర్యభూమి అజాత శత్రువైనది. దేశమంతా ఒకే త్రాటిలో బంధింపబడి వుంది. సింధునుండి కటకంవరకు కన్యాకుమారినుండి హిమాలయంవరకు, ఆర్య భూమికి, ఆర్యజాతికి సంబంధించిన జయజయ ధ్వానాలు ప్రతి ధ్వనిస్తున్నాయి. నేడు జాతీయతే శ్రేష్ఠమైన ఆర్యధర్మ మైంది. నా సుఖస్వప్నాలన్నీ దివ్యరూపాన్ని ధరించి యెదుట నిలబడి వున్నాయి. నా ప్రాణాలు తృప్తిచెందాయి ఇది సంతో షమే కాని సామ్రాట్టును తలచుకుంటే హృదయం తల్లడిల్లు తుంది. ప్రాణంలేని శరీరంవలె నేనుకూడ శవరూపం దరిం చాను. జాతీయధర్మం పూర్తయింది ఇప్పుడు ఆర్యధర్మాన్ని పాలించాలి. నాకు సత్యమార్గాన్నే చూపెట్టు. సామ్రాట్టును వెదకుటకై బయలుదేరుతాను, సోమరితనం సుఖమే కాని అది కర్తవ్యాన్ని మరపిస్తుంది. కర్మవీరుడు, సుఖాన్ని తృణీకరి స్తాడు. కాని ఒక్క విషయం నన్ను కలవరపరుస్తూ వుంది. ఒకశ్రేష్ఠ ఆర్యవీరుడు పిరికి అనార్యుల కారాగారంలో బం దీయై యున్నాడు. ఇది దేశానికంతకూ అవమానకరం. కళం కంతో నూరేళ్ళు జీవించేకంటే పవిత్రంగా ఒక్కక్షణం జీవిస్తే జీవితం ధన్యమవుతుంది. శత్రుసైన్యాన్ని అస్త్రబలంతో జయించి సామ్రాట్టును విముక్తుని చేయడం అసంభవం. కాని చాకచక్యంతో ఏదోవిధంగా నేను మహారాజును విముక్తుని చేస్తాను. కారాగారం నుండిగాని, భవసాగరం నుండిగాని,

విముక్తి పొందినప్పుడే ఆర్యులు నిష్కళంకులవుతారు. విజయమో, వీరస్వర్గమో అదే వీరుల ధర్మము. పృథ్వీరాజు పదవికి సామ్రాట్టు అయినా జాతికి ఆర్యులు. ఏకాలంలోకూడ ఆర్యుడు బందీ అవలేడు. ఇది విచిత్రమైన దైవలీల. ఓ భవతారిణీ! జ్ఞానజ్యోతిని ప్రసాదించు. నా మార్గాన్ని నేను శుభ్రపరచుకొంటాను." అని మాటిమాటికి భక్తిభావంతో చందకవి చండికను స్మరించి సమాధిలో మగ్నమైనాడు. ముఖంనుండి బ్రహ్మతేజం బయలుదేరింది. బాహ్యజ్ఞానం పోయి దృష్టి అంతర్ముఖమైంది. ఉషాదేవికి నమస్కరించి నిశాదేవి శెలవు తీసుకుంది.

# 13

చందకవి పర్వతశిఖరంపై కూర్చొని ఒకప్పుడు శూన్యాకాశాన్ని మరొకప్పుడు విశాలారణ్యాన్ని చూస్తున్నాడు. పైన నీలిరంగు క్రింద పచ్చరంగు మధ్యన ఆనందమునిచ్చే సూర్యాస్తమయ స్వర్ణకాంతి. ఒకవైపున సూర్యుని బంగారుకాంతి, మరియొక వైపు చంద్రుని తెల్లని కాంతి, మనోహరంగా వుంది. చందకవికి దూరంగా పంక్తులు తీరి వెళ్ళే ఆర్యసేన కన్పించింది. ఆర్యపతాకంకూడా కన్పించింది. యుద్ధభేరీలు విన్పించాయి. కవి లేచి సగౌరవంగా

ఆర్యపతాకానికి నమస్కరించి "ఓ ఆర్యపతాకమా! విశ్వ విజయాన్ని సాధించు. బహుశా నాకీ జన్మలో నీ దర్శనం యిహకాదు. ఆర్యజాతి అంతా యేకమై ప్రాణాలొడ్డి ఆర్య పతాకాన్ని రక్షించాలని నా చివరి కోరిక. చందకవి కండ్లలో కన్నీరు తిరిగింది. మళ్ళీ చూచాడు. ఆర్యసేన దూరంగా పోతూంది. కండ్లారా పతాకాన్ని ఢిల్లీకి పారిపోయే సైన్యాన్ని చూచాడు రాత్రి అయింది. నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. అడవిలో నాల్గువైపుల చల్లనిగాలి వీస్తోంది. చెట్లపైనుండి గుడ్లగూబలు గంభీరంగా కూస్తున్నాయి. పొదలలోనుండి నక్కలు అరుస్తున్నాయి. చందకవి ప్రశాంతంగా ధ్యాన మగ్నుడై కూర్చున్నాడు.

రోజులు వారాలుగాను, వారాలు నెలలుగాను, నెలలు సంవత్సరాలుగాను మారుతున్నాయి. కాలచక్రం ఆపినా ఆగేదికాదు. వసంతఋతువు పోయి గ్రీష్మఋతువు వచ్చింది. తరువాత ఆకాశ సముద్రంలో మేఘాలు ఓడలలాగా తిరు గాడు తున్నాయి. అవికూడ వర్షించి అదృశ్యమైనాయి. శర దృతువు నవ్వుతూవచ్చి బంగారుపంటలను దోచుకుపోయింది. హేమంతంవచ్చింది భూమి పాలిపోయింది. ఆకులు యెండి పోయాయి. తరువాత వణకుతూ శిశిరఋతువువచ్చింది. ఈవిధంగా ఋతుచక్రం వేగంగా తిరుగుతూ రోజులమీద రోజులుగడచి పోతున్నాయి. గోరి రాజధానిలో ఒక పకీరు

తిరుగుతున్నాడు. గడ్డముతో, మీసాలతో అతని ముఖం నిండి పోయింది. కండ్లనుండి ఆత్మతేజం పుట్టిపడుతూవుంది. ఫకీరుల వంటి దుస్తులు ధరించాడు. వ్రేళ్ళయందు జపమాల తిరుగుతూవుంది. కనబడినవారంతా ఆశ్చర్యంతో అతనికి సలాము చేసి తొలగిపోతున్నారు. నగరంమంతా ఈతనిపేరు మారు మ్రోగుతూవుంది. పోటీలుపడి ఈ పకీరుకు సత్కారాలు చేస్తున్నారు. యితడు పడమరనుండి వచ్చారని, మరి కొందరుతూర్పు నుండీ వచ్చారని అంటున్నారు. నూరిన మందును, ధ్యానమగ్నమైన ఫకీరును గుర్తించడానికి ప్రయాణమున్నది? అనేక భాషలు శుద్ధంగా మాట్లాడుతున్నారు. అందరూ శ్రద్ధతో పూజించి కృతార్థులమయ్యామని అనుకొంటున్నారు. అతడు సుఖదుఃఖాలకు, గౌరవాగౌరవాలకు అతీతుడు. భిక్షాటనయే రాజభోగంగా భావిస్తూ సుఖంగా కాలం గడిపేస్తున్నాడు. కొద్ది రోజులలోనే ఆయన కీర్తి నగరమంతటా వ్యాపించింది.

ఒకరోజు మహామంత్రి సుల్తానుతో :—"మన నగరమునకు తేజశ్శాలియైన ఫకీరు వచ్చాడు. అతనెప్పుడూ తత్వ చింతలో మగ్నమై యుంటాడు. పండ్లే అతనికి భోజనము. నేలయే అతనికి శయ్య. భూతదయ గలవాడు. భక్తులు యిచ్చే ధనాన్ని దీన దుఃఖితులకు పంచిపెడ్తూవున్నాడు. త్రికాలములందు తిరుగు విషయా లతని దృష్టికి కరతలామల

కములు అని చెప్పగా సుల్తాను "అట్టి మహా పకీరుని, త్యాగిని మహాభక్తుని నేను స్వప్నంలోకూడా యింతవరకు చూడలేదు. అటువంటి భక్తుడు నివసించు దేశమే దేశము. అయితే నీవొక సారి వారిని మన దర్బారులోకి తీసుకొని రాగలవా? వారిని దర్శించి ధన్యుడనౌతాను" అని అన్నాడు.

మంత్రి :—"మహారాజా! వారు యెక్కడికి వెళ్ళరు. నేనొకసారి విన్నవించాను. కాని నవ్వి వూరుకొన్నారు. తమరు విశ్వవిజయులు. వారు ఆత్మవిజయులు"అని వినయంగా అన్నాడు.

గోరి :—"నేను తిరిగి మరొకసారి కాఫిరలమీద దండెత్తాలని అనుకుంటున్నాను. యెనిమిదిసార్లు ఓడిపోయి తొమ్మిదవసారి దేశద్రోహియైన జయచంద్రుని సహాయంతో పృధ్వీరాజును బందించి తేగలిగాను. కాని యిప్పుడు దేశద్రోహి అక్కడొక్కడూ కనబడడు. అందువల్ల నాకు నిరాశ కల్గుతూ వుంది వజ్రాన్ని వజ్రంతోనే కోయాలి. ఇది నగ్న సత్యం. ఈ విజయం నాకు దుఃఖాన్నే కల్గించింది. యెందుకంటే చివరకు ఓడిపోయి పారిపోవలసి వచ్చింది. యిప్పుడు కూడా కాఫిరుల వుత్సాహము, మహారాణా హుంకారము నాకు వణకు పుట్టిస్తున్నాయి. నేనింతవరకు జయచంద్రుని వంటి సేనాపతిని, మహారాణా వంటి రౌద్రమూర్తిని యెక్కడా చూడలేదు. ఈ పరితాపంతోనే నేను క్షీణించి

పోతున్నాను. ఇందువల్లనే ఆతపశ్విని రాబోవు మంచి రోజులను గురించి అడగాలనుకుంటున్నాను. మళ్ళీ ఆ అందమైన, ధనధాన్య పూర్ణమైన కాఫిరుల దేశంపై దండెత్తాలి. సాహసంతో ప్రయత్నిస్తే యేపని సాధ్యంకాదు? కాబట్టి స్వయంగా నేను యోగిని దర్శిస్తాను. ఈ విషయం ఆయనతో విన్నవించాలి.

మంత్రి తలవంచి వినయంగా శెలవు తీసుకొన్నాడు.

## 14

నగరం వెలుపల ఒక అందమైన ఖర్జూరతోట. మొండకు ఆకులు మెరుస్తూ నాట్యము చేస్తున్నాయి. పక్షులు పాడుతున్నాయి. సెలయేరు కలకల ధ్వనులతో ప్రవహిస్తోంది భూమి పచ్చని, మృదువైన మఖమల్‌లాగ శోభిస్తూ వుంది. ఆ తోటలోనే ఫకీరు తీయని కలలు కంటున్నాడు. ఇంతలో గోరి పాదచారియైవచ్చి వినయంగా సలాంచేశాడు. రత్నాలు చెక్కిన పళ్ళాలలో రకరకాలైన పండ్లు తీసుకొని సేవకులు వచ్చారు. గోరీని చూడగానే పకీరు హృదయంలో ఆకలిగొన్న సింహంవలె అగ్నిజ్వాల ప్రజ్వరిల్లింది. భుజాలు పుప్పొంగినాయి. కండ్లు చింతనిప్పులులాగ ఎర్రబడినాయి.

కాని ఫకీరు ఈ భావాలను పైకి కనబడకుండా చిరునవ్వు నవ్వాడు కొంతసేపు ఆలోచించి "సుల్తానుగారూ ఫకీరు లుండే ఈ చోటుకు మీరెందుకు వచ్చారు?" అన్నాడు. గోరి చాల వినయంగా "నేను కొద్ది భూఖండానికి మాత్రమే చక్రవర్తిని. కాని తమరు ప్రపంచానికే చక్రవర్తులు. తమ వంటి మకుటంలేని చక్రవర్తి దర్శనంవలన నేను ధన్యుడ నయ్యాను." అని అన్నాడు. యోగి విషపూరిత చిరునవ్వు నవ్వి వెంటనే గంభీరం వహించాడు. గోరి భక్తితో కానుక లర్పించి "తమరు స్వయంపరిపూర్ణులు, అయినా తుచ్ఛమైన ఈ కానుక లర్పించి నేనునా భక్తిని తెలియజేస్తున్నాను. ఈ ప్రపంచంలో తమరు చూడజాలని వస్తువు లేదు. నేనొక విషయం తమతో విన్నవించ గోరుతున్నాను. కాని నా హృదయం భయంతో సంకోచిస్తూ వుంది." అని అన్నాడు. యోగి యేనుగును చూచిన సింహంవలె అగ్నికణాలవంటి కండ్లను తెరచాడు. ఆ తపోతేజాన్ని చూచి గోరి వణికి పోయాడు. యోగి "సుల్తాన్ మీరేమి చెప్పదలచారో నేను గ్రహించాను. కాని నేనొకసారి ఆ బంధితుని స్వయంగా చూడాలి. మీఅదృష్ట రేఖను చూచాను. ఇంక కాఫిరుల దేశంనుండి బంధించి తెచ్చిన ఆరాజు అదృష్టరేఖను చూడాలి. తరువాత నీవు శత్రుదేశంపై దండెత్తి విజయాన్ని పొంది, ధనంతో, కీర్తితో తిరిగి రాగలవో, లేవో, చెబు

తాను" అన్నాడు. గోరి సంతోషంతో "తమ ఆజ్ఞ అయితే యిప్పుడే ఆ బంధితుని పిలిపిస్తాను. మేమెప్పుడూ తమ దాసులమే. మీ ఆజ్ఞ మాకు శిరోధార్యము" అని వినయంగా అన్నాడు. పకీరు కొంతసేపు ఆలోచించి "నేనే స్వయంగా అక్కడకు వచ్చి చూస్తాను. మనమంతా కర్మపాశంచేత బంధింపబడిన పశువులలాంటివారము. విశ్వవ్యాప్తమైన భగవంతుడే ఫలాఫలముల నిస్తూవుంటాడు. తమరు నా కోసం కష్టపడి యింతదూరం వచ్చార"ని అన్నాడు. గోరి భక్తితో మాటిమాటికి సలాము చేస్తూ శెలవు తీసుకొన్నాడు. పకీరు నలువైపుల తేరిచూచి పెద్ద నిట్టూర్పు విడచి సమాధిలో మగ్నమయ్యాడు.

♦ ♦ ♦

యమ దూతలకుకూడ భయంగొలిపే కారాగారంలో భారతసామ్రాట్టు బంధింపబడి ఉన్నాడు. అంధకారమయమైన భూగర్భంలో కఠినమైన రాళ్ళచే కట్టబడిన ఒక చిన్న గది. దృఢమైన యినుపచువ్వలచే నిర్మింపబడిన ద్వారము తాళాలచే బంధింపబడి వుంది. వందలకొలది సైనికులు పేతములవలె, ఆకలిగొన్న తోడేళ్ళలాగ, కాపలా కాస్తున్నారు. గదిలో యెండుటాకులు పరచబడి వున్నాయి. ఒకమూల నీళ్ళతో నిండిన కుండ వుంది. ఆ బోనులో భారతసింహాన్ని బంధించికూడ గోరి నిర్భయంగా వుండలేకపోతున్నాడు. మృత్యుదేవతను తలపై కూర్చుండబెట్టుకొని యెవరు నిద్ర

పోగలరు? సూర్యాస్తమయ సమయం. ఇంటింటా దీపాలు అంధకారంలో యుద్ధం చేయడానికి సిద్ధమయ్యాయి. అట్టి సమయంలో ఫకీరు అకస్మాత్తుగా కారాగార ద్వారంవద్దకు వచ్చాడు. కాపలావారు వినయంగా ద్వారం తెరిచి తొలంగి పోయారు. ఒక సైనికుడు కాగడా పట్టుకొని దారి చూపిస్తు న్నాడు ధర్మరాజు కుంభీపాకనరకం చూచుటకు వెళ్ళినట్లుగా ఫకీరు గదిలో ప్రవేశించాడు సైనికుడు తాళము, కాగడా ఫకీరుకు అప్పగించి తిరిగివచ్చాడు. కాళ్ళచప్పుడు విని పృథ్వీ రాజు సింహంవలె రోషంతో గర్జించి "లక్షసార్లు చెప్పినా నీకు సిగ్గులేదా? ఘడియఘడియకు నన్నెందుకు రెచ్చగొడ తావు" అని అన్నాడు. ఈ గర్జన విని కాపలావారు అస్త్ర శస్త్రాలతో పరుగెత్తుకొని వచ్చారు. వెంటనే ఫకీరు వారిని వెళ్ళిపొమ్మని చెప్పి పృథ్వీరాజువంక జూచాడు. పృథ్వీరాజు ముఖం గడ్డంచేత, మీసాలచేత నిండివుంది. శరీరం క్షీణించింది. వస్త్రాలపై చీరపోతులు ప్రాకుతున్నాయి. చూడగానే సాధువు పరుగెత్తుకొనివెళ్ళి పృథ్వీరాజు కాళ్ళపై పడ్డాడు. పృథ్వీరాజు వ్యాకులత్వంతో "ఎవరు నీవు! ఎట్లా నిన్ను ఈ అంధత్వంలో గుర్తించగలను?" అని అన్నాడు. సాధువుదగ్గర స్వరంతో బాధపడుతూ "నేను చందకవిని. అయ్యో! తమ ఈ స్థితిని చూడలేకపోతున్నాను. దురదృష్టం నాకీ దృశ్యాన్ని చూపిస్తూవుంది. అయ్యో! నే నెంత అభాగ్యుడను?

"ఎవరు నీవు చందకవివా" అని పృథ్వీరాజు కేకవేసి యిక్కడికెట్లా రాగలిగావు? బందీగా వచ్చావా? లేక మన ఆర్యసేన ఈ దేశంపై దండెత్తి విజయాన్ని సాధించిందా? అని" అన్నాడు. చందకవి భయంతో "నెమ్మది నెమ్మదిగా మాట్లాడండి మహారాజా" అని తన కధనంతనూ వినిపించాడు. ఇక్కడకు వచ్చిన రహస్యాన్నికూడ తెలియజేశాడు. అది విని పృథ్వీరాజు తృప్తి జెందాడు. అతని కండ్లనుండి పవిత్రమైన గంగా యమునలు ఒక్కసారిగా వుప్పొంగినాయి. "మిత్రమా! నా మనస్సులో పరితాపమంతా ఆర్య సేన విజయకధ విని తొలగిపోయింది. నీవు అసంభవాన్నె సంభవం చేయగలవు. పిరకివాడు అవసరంకోసం యెదురు చూస్తూ వుంటాడు. కాని కర్మవీరునికి అవసరమే మార్గం చూపిస్తుంది. చావడానికి నాకేమీ చింతలేదు. ముందు జరగవలసిన యేర్పాట్లు త్వరగా చేయించు. నేనుగూడ సిద్ధంగా ఉన్నాను. ఈనాడు నేనుకూడ "భారతభూమికి జై" అని భారతాధీశ్వరి సంయుక్తకు జై అని అంటున్నాను. అని ఒకసారి చందకవిని కౌగిలించుకొని గద్గదకంఠంతో యేదో చెప్పబోయాడు. కాని ఒక్కమాటైనా నోటినుండి బైటికి రాక అధైర్యంతో యేడ్వసాగాడు. చందకవి మహారాజు పాదధూళిని తీసికొని శలవు తీసుకొన్నాడు.

అది సూర్యోదయ సమయం. పక్షులు గూళ్ళనుండి కలకల ధ్వనులతో బయలుదేరాయి. మసీదులనుండి నమాజు ధ్వనులు వినబడసాగాయి. ఆ సమయంలో ఫకీరు నధ్యాయమగ్నుడై కూర్చున్నాడు. గోరి ముఖ్యమంత్రివచ్చి ఒక వైపు నిశ్శబ్దంగా కూర్చున్నాడు. అప్పుడు మంత్రి సలాము చేసి సవినయంగా "ఈ దాసుని నమస్కారాన్ని స్వీకరించండి" అన్నాడు ఫకీరు "అంతా సరిగానే వుంది. గోరి నిన్ను పంపించాడా? నిన్న నేను బంధితుని అదృష్టరేఖను చదివాను. మీారేమీా చింతించవలసిన పనిలేదు. అతని మంచిరోజులన్నీ గతించాయి. అట్టువంటి విలుకాడు ఎక్కడ వెదకినా కనిపించడు. ఒకరోజు ఆతని విలువిద్యా కౌశల్యాన్ని చూద్దామని సుల్తానుతో చెప్పు. అతనుకూడ తన కళాకౌశలాన్ని చూపించడానికి సిద్ధంగా వున్నాడు. అతడు ఒక్కొక్క మణుగు బరువుగల యేడు యినుపరేకులను ఒకేబాణంతో ఒకేసారి కొట్టగల మహాయోధుడు. ఈ విద్యను సుల్తాను పృథ్వీరాజువల్ల నేర్చుకొనవచ్చు. మంచిని గ్రహించటంలో శత్రు మిత్ర భేధాన్ని పాటించగూడదు. సరేమీారు వెళ్ళి సుల్తానుతో చెప్పండి. భవిష్యత్తులో కాఫిరుల దేశానికి ఆయనేతప్పక రాజవగలడు. కాని ప్రస్తుతం గ్రహపాటు సరిగాలేదు. మంచిరోజువస్తుంది కాబట్టి సేనను తయారులో వుంచండి" అన్నాడు. మంత్రి ఈ శుభసందేశాన్ని తీసుకొని

గోరీతో చెప్పాడు. గోరి ఆనందంతో పకీరు నిజమే చెప్పాడు. మనముకూడ ఆ వీరుని భీషణ పరాక్రమాన్ని చూద్దాము. వెంటనే యేర్పాటు చేయించు, ప్రజలంతా చూడగలందు లకు బహిరంగసభ యేర్పాటు చేయించు. మహారాజుకు గడ్డం శుభ్రంచేయించి, స్నానం చేయించి, మంచిగుడ్డలు కట్టించి దర్బారులోనికి తీసుకొనిరండి. ఆ శబ్దభేదిపరీక్షా సమయంలో పకీరుకూడ దగ్గర వుండడం యెంతో మంచిది. కాబట్టి వారుకూడ వచ్చే యేర్పాటు చేయించు." అని అన్నాడు సుల్తాను.

మంత్రి శలవుతీసుకొని వెళ్ళిపోయాడు. రంగస్థలం తయారయింది. ఒక్కొక్క మణుగు బరువుగల యేడు యినుపరేకులు తయారుచేయబడ్డాయి. తగిన సమయానికి ప్రజలంతా వచ్చారు. రకరకాలైన సంభాషణలు జరుగు తున్నాయి. కొందరది ఇంద్రజాలమంటున్నారు. కొందరు ఈ యేడు యినుపరేకులను ఒకే బాణంతో కొట్టడం అసంభవ మనిఅంటున్నారు. కొందరు వృద్ధులు "కాఫిరుల దేశంలో ముత్యాలు పండుతూవుంటాయని, చెట్లకు రత్నాలు రత్నాల పగడాలు కాస్తుంటాయనీ, బంగారు పర్వతాలుంటాయని, అక్కడి పిల్లలు రత్నాలతో గోలీఆటలు ఆడుకుంటారని, పాలు, నెయ్యి తేనే నదులవలె ప్రవహిస్తాయని, మంచినీళ్ళకు బదులుగా పాలు, తేనె త్రాగుతారని, స్వర్గలోకపు దేవ

కన్యలు వాకిళ్ళు వూడుస్తూ వుంటారని, పిల్లలు గుహల్లో పాలు త్రాగే సింహంపుపిల్లలను మెడపట్టుకొని బైటకు లాక్కు వస్తారని, అటువంటి దేశానికి రాజైన యితడు ఒకే బాణంతో యేడు యినుపరేకులను కొట్టడం యేమీ అసంభవము కాదని అతని ఒక్కొక్క భుజంలో యేడు యేనుగుల బలం వుంటుం దని అనుకోవడం ప్రారంభించారు.

ప్రజాసమూహం ఉత్సాహంతో యెదురు చూస్తు న్నది. పెద్ద పెద్ద భవనాల్లో కిటికీలగుండా స్త్రీలు బురఖాలు తొలగించి మేఘాలు వదలిన చంద్రునిలాగ తొంగిచూడ నారంభించారు. రోగులు, వృద్ధులు ఈ దృశ్యాన్ని చూడ లేకపోయామని యేడ్వసాగారు. ఇంతలో దూరంగా యేనుగు గంటల ధ్వనులు, గుఱ్ఱాల డెక్కల ధ్వనులు విన్పించాయి. పర్వతంలాంటి ఒక మదపుటేనుగు వూగులాడుతూ వస్తూ వుంది. దాని చుట్టూ వందలకొలది గుఱ్ఱపు రౌతులు అస్త్ర శస్త్రాలు ధరించి నడుస్తున్నారు. తూర్పుకొండపై పూర్ణ చంద్రునివలె మదపుటేనుగుపై పృథ్వీరాజు కూర్చుని కన్పిస్తు న్నాడు. ఇంద్రజిత్తు ఇంద్రుని బంధించి ఐరావతంపై కట్టి లంకకు తీసుకొని వచ్చినట్లు పృథ్వీరాజును యేనుగుపై యినుపగొలుసులతో బంధించి తీసుకొని వచ్చారు. ఆయన వెనుకవైపు విచ్చుకత్తులు ధరించి వీరయోధులు కూర్చొని వున్నారు. యేనుగుచుట్టూ బల్లెములు, కత్తులుధరించిన

వీరులు జాగరూకులై వస్తున్నారు. అది చూచి ప్రజలంతా "ఆహా! యెంత అదృష్టవంతుడు? అటువంటి మహారాజు పాలనలో నున్న ప్రజలే ప్రజలు" అని అనుకొన్నారు. సైనికులు "ఆహా! ఇటువంటి వీరసేనాపతి అధీనంలో నున్న సైనికులే సైనికులు" అని అనుకొన్నారు. వృద్ధులు యెంతో పుణ్యం చేసుకొన్న వారికిగాని యిటువంటి పుత్రరత్నం చేతిసీళ్ళ మరణకాలంలో లభించవని," యువకులు: "ఇటువంటి నాయకుడు దొరికితే బ్రహ్మాండాన్నికూడ తల్లక్రిందులు చేయగల్గిన శక్తి తప్పక కల్గుతుంద"ని ఈ విధంగా అందరు ముక్త కంఠంతో పృథ్వీరాజు రూప, గుణ, తేజస్సులను గురించి చెప్పుకొనసాగారు.

## 15

అది భయంకర దుర్గము. మూడు వైపుల పెద్ద పెద్ద బలిష్టమైన గోడలచేతను, నాల్గవవైపు ఆకాశాన్ని అంటుకొంటున్న గోరి విశాలభవనంచేతను, శోభిస్తూ వుంది. అనేక మందివీరసైనికులు సింహద్వారమువద్ద కాపలా కాస్తున్నారు. కోటవెలుపల పెద్ద కందకము. దానిలో మొసళ్ళుతిరుగాడుతూ భయం గొల్పుతున్నాయి.

యమదూతల మధ్యనున్న యమునివలె మంత్రుల మధ్య ఒక పెద్ద గద్దెపై గోరి కూర్చొని వున్నాడు. అత్రు

శస్త్రాలతో అంగరక్షకులు జాగ్రత్తగా చూస్తున్నారు. పై భాగంలో స్త్రీలు కూర్చొనే చోట ముత్యాలు కూర్చిన పరదాలు అల్లల్లాడుతున్నాయి. కోట బురుజుపై యేడు యినుపరేకులు ఒకదాని వెనుక ఒకటి యినుపగొలుసులతో కట్టబడి వేలాడుతున్నాయి. రంగస్థలానికి మధ్యగా ఒక యెత్తైన ఆసనమున్నది. అదే పృథ్వీరాజు కూర్చునే స్థలము. ఎదురుగా భయంకరమైన ఒక దనుస్సు, అనేక బాణాలు వున్నాయి, వర్షాకాలపు నదివలె జనసమూహం వుప్పొంగుతూవుంది. ఇంతలో యేనుగుపై పృథ్వీరాజు వచ్చాడు. ప్రజలు యెక్కడివారక్కడ లేచి నిలబడ్డారు. గోరికూడ హఠాత్తుగ లేచి వెంటనే సిగ్గుపడి కూర్చున్నాడు. హర్షధ్వనులు మిన్నుముట్టాయి. ప్రజలను సర్దడానికి సైన్యానికికూడా అసాధ్యమైపోయింది. ఇంతలో ప్రశాంతంగా, గంభీరభావముతో, కంబళి కప్పుకొని, భగవంతుని ధ్యానిస్తూ ఫకీరు వచ్చాడు. సుల్తాను గద్దెపైనుండి లేచి వినయంగా మోకరించి "గురుదేవా! మేముధన్యులము. తమరు మంచెపై కూర్చోండి" అని అన్నాడు. ఫకీరు :—"నేను ఎప్పుడూ ఎవరియింటికి వెళ్ళను. అయినా సుల్తానుగారి ప్రేమ నన్ను బంధించి తెచ్చింది. మీరు కూర్చోండి. నేనెక్కడైనా కూర్చోగలను" అని రంగస్థలమంతా తిరగ నారంభించాడు.

బంధనాలు విప్పి పృథ్వీరాజును యేనుగుపైనుండి దింపారు. చేయి పట్టుకొని నెమ్మదిగా మంచెపైకి యెక్కిం

చారు. ఇంతలో ఫకీరు తిరిగివచ్చి పృథ్వీరాజుతో "మీరు జాగ్రత్తగా లక్ష్యభేదము కుడివైపుగా చెయ్యండి. బలిపశువు అక్కడే కూర్చొనివున్నాడు. గురి తప్పకూడదు. గురి తప్పిందా మన దేశం సర్వనాశన మవుతుంద"ని ప్రాకృత భాషలో చెప్పాడు. పృథ్వీరాజు:—"మహాచండికపై మనకు నమ్మకమున్నది కాబట్టి ఒక్క బాణంలో స్వదేశ కళంకాన్ని కడిగివేస్తాన"ని జవాబు చెప్పాడు. ఇంతలో మంత్రి నిలబడి పెద్దగా "అందరూ శాంతంగా ఉండండి అదుగో చూడండి మన సుల్తానుగారు యుద్ధంలో ఓడించి, బంధించి తెచ్చిన పృథ్వీరాజు కూర్చునివున్నాడు. మన శత్రువు యెంత బలవంతుడో మీరిప్పుడే చూస్తారు. ఇతడు కాఫిరుల దేశానికి చక్రవర్తి. ఈనాడు మన వీరదేశంలో బందీగా వున్నాడు. ఎదురుగా ఒక్కొక్క మణుగు బరువుగల యేడు యినుపరేకులు వ్రేలాడుతున్నాయి. ఒక్క బాణంతో యితడు వీటి నన్నిటిని భేదిస్తాడు. ఈతడు గ్రుడ్డివాడై నప్పటికి శబ్దభేది బాణంతో కొడతాడు. జాగ్రత్తగా మీరంతా చూడండి"అని చెప్పాడు ఈ మాటలు విన్న పృథ్వీరాజు హృదయం మండిపోయింది. ఇంతలో సుల్తాను "ధనుస్సు, బాణాలు పృథ్వీరాజు కివ్వండ"ని ఆజ్ఞాపించాడు. పృథ్వీరాజు యిదివిని అజ్యంపోసిన అగ్నివలె ఉగ్రుడై ధనస్సు, బాణాలు, తీసుకొని నిలబడ్డాడు. ఆర్య రక్తం ఉడుకెత్తింది. కనుబొమలు వంకర తిరిగాయి ప్రేక్షకు

లంతా భయంతో ఒక్కసారి కేకలు పెట్టారు. పృధ్వీరాజు సింహంవలె గర్జించి భయంకర ధనస్సు వంచి నారిసారించ గానే అది తిరిగిపోయింది, అతని బలపరాక్రమాలు చూచి ప్రేక్షకులంతా నిశ్చేష్టులైనారు "మరొక ధనుష్షు ఇవ్వండి" అని పకీరు కేకవేశాడు. అనేక దనస్సులిచ్చారు అన్నీ విరిగి పోయినాయి. అప్పుడు సుల్తాను "జయచంద్రుడు మనకు కానుకగా యిచ్చిన ధనస్సు యింతవరకు మనము వాడనేలేదు. దానిని తెచ్చి యివ్వండ"ని ఆజ్ఞాపించాడు. వెంటనే సైనికులు ఇంద్రధనస్సువంటి ఆ ధనస్సును తెచ్చి యిచ్చారు. అది తీసుకొని పృధ్వీరాజు ముద్దు పెట్టుకొని కౌగ లించుకొన్నాడు. నారి సారించి ఒక్కసారి టంకారంచేసి "నా కిప్పుడు మంచి పదునైన రెండు బాణాలివ్వండి. ఒక రాతితో ఆ రేకులను కొట్టండి నేనా శబ్దాన్ని బట్టి భేదిస్తాను" అని అన్నాడు. రెండు పదునైన బాణాలను యేరి ఫకీరు నవ్వుతూ పృధ్వీరాజు కిచ్చి "ఆర్యపుత్రా! ఒక్కక్షణంలో ఆర్యజాతి పాపపంకిళమంతా కడిగివేయబడుతుంది. నేనీ నాడు చాల ఆనందంగా వున్నాను. పరితాపమంతా పటాపంచ లైంది. బాణాన్ని జాగ్రత్తగా వేయండి. నేను మీ ప్రక్క గానే నిలబడి వుంటాను" అన్నాడు బాణాలు తీసుకొని కనుబొమ్మలు నిగిడించి, దృష్టినిలిపి పృధ్వీరాజు శబ్దంకొరకు ఎదురు చూస్తున్నాడు. శబ్దం వినిపించింది. పృధ్వీరాజు

బాణాన్ని చెవివరకు లాగి వదిలాడు. వెంటనే యేడు యినుప శేకులు ఒక్కసారిగా తెగి క్రిందపడ్డాయి. అదిచూచి గోరి ఉత్సాహంతో "వహ్వా" అంటూ కేకపెట్టాడు. వెంటనే రెండవ బాణంతో ఆ శబ్దంవచ్చినవైపు కొట్టాడు. గోరి కంఠం తెగిపోయింది. అతడు గద్దెపైనుండి క్రిందకు ఒరిగాడు. ఆ బాణం అంతటితో ఆగక అనేకమంది దురదృష్టవంతు లను భేదించుకొంటూ వెళ్ళి ఒక గోడకు తగిలింది ఆ రాపి డికి అగ్నిజ్వాలలు బయలుదేరాయి. రంగస్థలమంతా ఆహాకారాలతో ప్రతిధ్వనించింది. వెంటనే పకీరు "ఆర్య భూమికి జయమగుగాక" అని కేకలు వేశాడు. ప్రేక్షకులు, మంత్రులు, సైన్యాధిపతులు, సైనికులు భయంతో కేకలు వేసుకొంటూ పారిపోయారు. ఆ తొందరలో కొందరు కోట కందకంలో దూకారు. కందకంలో నున్న మొసళ్ళు వాళ్ళను మింగివేశాయి. ఈ గగ్గోలుచూచి మదపుటేనుగులు గొలుసులు త్రెంపుకొని జన సమూహంపై విరుచుకుపడ్డాయి. కోటంతా కంపించిపోయింది. ఆ సమయంలో చందకవి "మహా రాజా! శత్రువు సమసిపోయాడు. ఇదిగో, కత్తి తీసుకోండి, మీరు నన్ను పొడవండి, నేను మిమ్మల్ని పొడుస్తాను అని ఒక ఖడ్గాన్ని పృథ్వీరాజు కిచ్చాడు. రెండుకత్తులు మెరపు ల్లాగ మెరసాయి. ఒక్కక్షణంలో వీరులిద్దరూ నేల కొరిగారు. వీరులైన పుత్రులు తమ తల్లి భారతి కళంకాన్ని తమ రక్తంతో కడిగివేస్తారుగదా!

ఢిల్లీలో భారతేశ్వరి సంయుక్త రాచకార్యములన్ని చక్కగా నెరవేర్చి దుఃఖంతో ఉద్యానవనంలో కూర్చుని వున్నది. ఆమె వెంట అయిదు యేండ్ర వయస్సుగల కుమారుడు "రైనసి" శకుంతల వెంటనున్న భరతునివలె శోభిస్తున్నాడు. పక్షులు కూస్తున్నాయి. సరోవరంలో రాజహంసలు కలకల ధ్వనులతో ఈదుతున్నాయి. ఫలపుష్పాలతో వృక్షాలు కిలకిలలాడుతున్నాయి. ఆకాశం నిర్మలంగా వుంది. సంయుక్త ముఖంలో విషాదచ్ఛాయలు ఆవరించాయి. ఆమె కండ్లు మూసుకొని యేదో ఆలోచనలో మగ్నమైంది. ఆమె కండ్లయెదుట ఒక దివ్యదృశ్యం కన్పించింది:— "నీలాకాశంలో భారత జనని ఎర్ర కలువపై కూర్చొనివుంది. ఆర్యపతి పృథ్వీరాజు, చందకవి ఆ తల్లి ఒడిలో భవానీ వడిలో కూర్చొన్న కుమారస్వామి, విఘ్నేశ్వరులవలె కూర్చున్నారు, వారి యెదుట బాణంచే ఛేదింపబడి ప్రాణహీనుడైన గోరి పడివున్నాడు." ఈదృశ్యాన్నే "రైనసి"కూడా చూచాడు. వెంటనే అతడు పెద్ద కేక పెట్టాడు. అది విని సంయుక్త మేల్కొని కుమారుని హృదయానికి గట్టిగా హత్తుకుంది. ఈదృశ్యాన్నే భర్తపాదుకలకూ పూజచేస్తున్న కవిపత్నికూడ చూచింది. తండ్రి ప్రారంభించిన మహాకావ్యాన్ని పూర్తిచేయడంలో మగ్నమైయున్న చందకవి కుమారుడు "జాల్హా" మిగిలిన కావ్యాన్ని పూర్తిచేసి భక్తిశ్రద్ధలతో భవానిని స్మరించాడు.



